# ఆశస్సులు

మీరు వ్రాసిన "హిందీ మనకు ఎందుకు అనవసరం?" అనే పుస్తకాన్ని చదివినాను. నేను పూర్తిగా మీ అభిప్రాయంతో అంగీకరిస్తున్నాను ఇంగ్లీషు మనరాజభాషగా ఉండడంమూలాన ఏలాటి నష్టమూలేకపోవడమే కాకుండా, అనేక లాభాలు కూడా మనకు కలుగ గలవు. దేశంలో తక్కిన భాషలు మాట్లాడు వారందరికీ ఇంగ్లీషు వలెనే హిందీభాష విదేశ భాష అనే అభిప్రాయం సమంజసంగా వున్నది. అయితే చిక్కు ఎక్కడ వస్తుందంటే—మీ వాదం యుక్తి యుక్తంగా ఉన్నా, దేశంలో ప్రముఖులనేకులు దానికి వ్యతిరిక్తంగా ఉన్నారు. సామాన్యప్రజలు దీనిని గురించి ప్రముఖులను అనుసరించే వారేగాని స్వతంత్రంగా వ్యవహరించగలవారు కారు. ప్రజాభిప్రాయానికి విరుద్ధంగా ఉండే సిద్ధాంతం ఎంత సహేతుకమైనా ఆచరణసాధ్యం కాకపోవచ్చు. కాని అంతమాత్రంచేత సిద్ధాంతాన్ని వదలుకొనవలసిన అవసరంలేదు. సిద్ధాంతాన్ని ప్రచారం చేయడమే మన కర్తవ్యము. ఈ దృష్ట్యా మీపుస్తకము ఎంతో ప్రయోజనకారి కాగలదు. మీ అభిప్రాయంవంటి దానినే నేను నా సంపాదకీయత్వాన ప్రచురింపబడుచుండు "ఎడ్యుకేషనల్ ఇండియా" లో అనేక పర్యాయాలు వ్యక్తపరచినాను. ఆ కారణంచేత కూడా, మీ పుస్తకమునకు ఎక్కువ ప్రచారము కలుగవలయునని ఆశిస్తున్నాను.

మద్రాసు — ఇట్లు

తేది. 8–11–50 (సం) మామిడిపూడి వెంకటరంగయ్య

# క్షమించండి

సమాజాన్ని దీక్షతో, విశ్వాసంతో ఒక దిక్కుకు అకుంఠితంగా నడిపించగల పరిస్థితులు స్వతంత్రము వచ్చాక ఇంతవరకూ ఏర్పడలేదు. పరస్పర విరుద్ధాలైన రకరకాల స్వప్రయోజనాలను గురిగా పెట్టుకుని, సామాన్యుడిని విహ్వాల పరిచేటంత వడితో, విపరీత విశ్వాసంతో, పరవళ్ళు తొక్కే ఉన్మాదంతో వివిధాలైన శక్తులు అరాజకంగా దూసుకుపోతున్నాయ్ నేడు. వందిమాగధుల స్తోత్రాలతో కోలాహలము చెలరేగుతోంటే, అజ్ఞానము ఆహారంగా, పటాటోపము వృత్తిగా, దౌర్జన్యము వేటకుక్కలుగా, కించిత్తు ప్రయోజనం కోసం జాతీయ శ్రేయస్సునే నిర్లజ్జగా, నిర్భయంగా వధ్యశిలకు కొనిపోయే భయానక సాహసంతో ఒకరకము శక్తులు వేట సాగిస్తున్నవి, మనందరి మధ్యా, మనందరము నివ్వెరపోయి చూస్తోంటే.

ఈ శక్తులు ఎవరో కాదు. రాజకీయ నాయకులు. అందరూ కాదు. జాతి జీవనములో విద్యా, సాంఘిక, సారస్వత, రాజకీయ, తాత్త్వికాది రంగాలు తమతమ ప్రత్యేక వ్యక్తిత్వాలు కలిగి వుంటూ ఆయా ద్రష్టలు నిర్దేశించిన మార్గాలలో వికాసంపొందుతూ వుంటాయని ఈ రకం రాజకీయ నాయకుల అవగాహనకు రాదు. అధికారమనే జలయంత్రపు మీట నొక్కి అన్ని క్షేత్రాలలోను తమ పంటలు పండించుకోవటము, వీళ్ళ ఏకైక ప్రకటితాశయము. ఒక విశ్వాసము, విలువా అర్థంకాక తత్కాల పరిస్థితులను బట్టి, మౌఢ్యం కారణంగానో, సంకుచిత స్వప్రయోజనాల్నాశించో నాలుగు గొర్రెలు ఒక వైపుకు నడుస్తోంటే, ఈలవేసి చప్పట్లు చరచి ఆ గొర్రెలముందు నడుస్తో మూడోరకం నాయకత్వము సమకూర్చుకుని, సర్వజ్ఞతా భ్రాంతిలో పడి విచ్చలవిడి పెలు మీర

తారు వీళ్ళు. ఏ వైజ్ఞానిక రంగము, ఏ సత్యం, ఏ విలువ, ఏ జాతి క్షేమము ఎటుపోతేనేం గాక, వెంటవచ్చే గొర్రెల సంఖ్య తగ్గకుండా చూసుకోవటం ముఖ్యం. ఇసుక దిబ్బల్ని జలాశయాలని, రాతి గుట్టల్ని మహావృక్షాలనీ గొర్రెల్ని పూరిస్తో నాయకత్వం కాపాడు కోవటం ప్రాణావసరం.

గోవులూ, జాతులూ, వాటి పెంపకము ఎలావున్నా, వెనక ఏ ముస్లిము మతోన్మాదిఎన్ని గోవుల్ని చిత్రవధ చేయించాడో దాన్ని బట్టి ఇప్పటి గో సమస్యా పరిష్కార ముంటుంది. మనం ఇప్పుడు తోలు చెప్పుల్ని నిషేధించమనటంలో పుణ్యం, పురుషార్థము కలిసిరావాలి. జనాభా లెక్కలు, ఆర్థిక, రోగబాధలు అంత లెక్కలోవి కావు; సంతాన నిరోధానికి దూరంగానైనా సంబంధించి మనుధర్మ శాస్త్రంలో ప్రక్షిప్తంకాని ఒక శ్లోకానికి టీక అతి ముఖ్యం. భాషా సూత్రాలూ, వాటి పరిణామము ప్రధానం కావు; ఒక ప్రాంతం వారి మాండలికము ప్రామాణికమై పోతోందని రెండో ప్రాంతం వాళ్ళ ముందు గగ్గోలు పెట్టి, వాళ్ళని రెచ్చగొట్టాలి. పసివాళ్ళ మెదళ్ళు, వ్యక్తిత్వాలు చిత్రవధఅయి, ముందు తరంలో జాతి ఏమయితే ఏంగాక. 7వ భాషగానైనా ఫలానా భాషని నిర్బంధముచేసి, ఆ వర్గమువారు తన్మయులై, తలలాడించేట్టు చూడటం అర్జంటు.

నవభారత సంస్కృతిని ప్రతి ఫలిస్తున్న 13 భాషలూ "జాతీయ భాషల" నటం సరియైన సిద్ధాంతంగాని, ఏఒక్క హిందీనో "జాతీయ భాష" అనటం తప్పు. ఇప్పుడు మనసమస్య "రాజభాష"ని గురించి అని ఏవరేనా ముందుకొచ్చి అంటే, వాళ్ళని జాతీయ విద్రోహులని అరచి, చప్పట్లు చరిపించుకోవటం వీళ్ళ రాజకీయ తిరుమంత్రము. అన్ని జాతీయ, సాంస్కృతిక సమస్యల్ని. సత్యాల్ని వంకరచేసి రాజకీయావసరాలకి విరుచుకోవటం వీళ్ళ నీచ సంస్కారములో జీర్ణించి పోయింది.

శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య గారు తమ అభిప్రాయములో పేర్కొన్న "ప్రముఖులు" ఈ పైవర్గము వారేనని

నేననుకొంటున్నాను. శ్రీయుతులు వెంకటరంగయ్య, లక్ష్మణ స్వామి మొదలియార్, రాజాజీ, రామన్, రాజమన్నార్లు హిందీ విషయమై మనకు హెచ్చరికలు చేస్తున్నారు. ఒక ఆలీఘర్ విద్యావేత్త, ఒక మద్రాసు న్యాయమూర్తి, ఒక కలకత్తా శాస్త్రజ్ఞుడు, ఒక ఆంధ్ర ఆచార్యుడు, ఒక దాక్షిణాత్య మేధావి మన జాతికి హితులూ, మనకు విశ్వసనీయులో లేక ఆ పైవర్గపు నాయకమ్మన్యులో మనం తేల్చుకో వలసిన సమయం ఆసన్నమైంది. అజ్ఞానానికీ, జ్ఞానానికీ మధ్య, అహంకారానికి విజ్ఞతకీ మధ్య, దౌర్జన్యానికీ దూరదృష్టికీ మధ్య, అధికారానికీ, ఆశయోన్నతికీ మధ్య, జరుగుతున్న ఈ ప్రచ్ఛన్న యుద్ధము యొక్క జయాపజయాలమీదే ఈ జాతి భవిష్యత్తు ఆధారపడి ఉంటుందంటే అతిశయోక్తి కాదు.

ఈ మాటల్లోని ఉద్రేకాన్ని క్షమించి, సత్యాన్ని చూడమని పాఠకుల్ని ప్రార్థిస్తున్నాను. పుస్తకములోని విషయము చాల కూల్గా, శాస్త్రీయముగా వుంటుందని అభయమిస్తున్నాను.

నాకు తోచిన సత్యాన్ని బయటికి వినిపించాలని నే చేసిన ఈ చిన్న ప్రయత్నంలో, ఎటునుంచీ "చిరునవ్వా, చేయూతా" లేక దిగాలుపడి వున్న సమయంలో నాకు కొండంత బలాన్నిచ్చిన శ్రీ వెంకటరంగయ్యగారికి, శ్రీ కొడవటిగంటి కుటుంబరావు గారికి కృతజ్ఞత తెలియ చేస్తున్నాను.

"హితవాది."

# అంకితము

అనాదిగా సహనమే సంస్కృతి అని నమ్మి ఏకాలం
లోనూ తన వంతు కర్తవ్యాన్ని నిరాడంబరతతో
నిర్వహిస్తూ వస్తున్న చరిత్రగల ఈ జాతికి...

# విషయసూచిక

# హిందీ మనకు

# ఎందుకు అనవసరం?



## 1. సమస్య స్వరూపము

రాజ్యాంగము ప్రకారము, దేవనాగరి లిపితో కూడిన హిందీ ఇండియా 'అధికారభాష' లేక 'రాజభాష' (Officail language) గా వుంటుంది. మనం సౌలభ్యం కోసం 'రాజభాష' అన్న శబ్దాన్ని వ్యవహరిద్దాం. అయితే అలా హిందీ రాజభాషగా వుండటం ఇప్పటినుంచీకాదు. రాజ్యాంగము అమలులోకి వచ్చిన 15సం॥ల నుంచి, అంటే 1965వ సం॥ నుంచి, అప్పటివరకూ ఇంగ్లీషే పూర్వంలాగ ఆ స్థానంలో కొనసాగుతూ వుంటుంది.

ఈ రాజభాష ప్రాముఖ్యత ఏమిటి? ఇవి దేశజీవితంలో ఎలాంటిపాత్ర వహిస్తూ వుంటుంది? ఇది కేంద్రప్రభుత్వ వ్యవహారభాషగా వుంటుంది. ఒక రాష్ట్రానికి, మరొక రాష్ట్రానికి, కేంద్రానికి రాష్ట్రానికి మధ్య జరిగే వ్యవహారమంతా కూడ ఈ భాషలో జరుగుతుందని రాజ్యాంగం నిర్దేశిస్తున్నది. అన్ని కేంద్ర శాఖల ఉద్యోగాలకు (పోస్టల్, రైల్వే,

ఎక్సైజు, రేడియో, ఇన్‌కంటాక్సు, ఎన్‌ఫోర్స్‌మెంటు టాక్సు, నౌకా, వైమానిక, బ్యాంకింగ్, ఇన్సూరెన్సు, ఎలెక్షన్లు, జనాభా లెక్కలు, విదేశపు వ్యవహారాలు, మొదలైనశాఖలు) హిందీలో విద్యార్హత అవసర మవుతుంది. ఇతర రాష్ట్రాల్లో అన్ని సెక్రెటేరియటు సర్వీసుల్లోనూ, కొన్ని ముఖ్యమైన మినిస్టీరియల్ సర్వీసుల్లోను హిందీభాషార్హత కావాల్సివస్తుంది. రాష్ట్రాల్లో రెండవ లేక మూడవ భాషగా హిందీ బోధనకు హిందీ పండితులు కావాలి. కేంద్రప్రభుత్వ గ్రాంటులమీద ఆధారపడే అన్ని ప్రజాసంస్థలలోను, కేంద్రప్రభుత్వ అజమాయిషీలో ఉండే విశాఖ నౌకా నిర్మాణకేంద్రం, సిర్‌పూరు చిత్తరంజన్ ఫాక్టరీలు మొ॥ వాటిలో హిందీనేర్చిన ఉద్యోగులు అవసరమవుతారు. అంటే, కేంద్రానికి ఏ మాత్రమూ సంబంధమున్న ప్రతిశాఖలోను సంస్థలోను హిందీ తెలిసిన సిబ్బంది కావాలి. 'ఫెడరల్' స్వభావంకంటె 'యూనిటరీ' స్వభావాన్నే ఎక్కువ కలిగివున్న మన రాజ్యాంగం కేంద్రప్రభుత్వంచేతిలో ఎక్కువ శక్తులు కేంద్రీకరించటంవల్ల, ఈ రాజభాషా ప్రాముఖ్యత విశేషంగా వుంటుంది.

అయితే ఈ ప్రాముఖ్యతను మనం అతిశయోక్తిగా చెప్పుకోకుండా సరిగా గుర్తించవలసిన అవసరం వున్నది. రాజ్యాంగంలోని ఏసూత్రాలూ రాష్ట్రప్రభుత్వాల వ్యవహారభాషగా హిందీ ఉండాలని నిర్బంధించవు. ఆరాష్ట్రంలో ప్రముఖంగా వున్న ఒకటిగాని అంత

కంటే ఎక్కువగాని భాషల్ని రాష్ట్ర ప్రభుత్వం తన వ్యవహార భాషలుగా గుర్తించవచ్చు. ఉదాహరణకి, ఆంధ్ర దేశంలో ఇతర భాషలు చెప్పుకోదగిన ప్రచారంలో లేనందున తెలుగు భాష మాత్రమే రాష్ట్ర ప్రభుత్వభాషగా వుంటుంది. వ్యవసాయంచేసి జీవించే రైతులాంటి సామాన్యుడికి, ప్రభుత్వంతో తన సంబంధాలకు రాష్ట్ర ప్రభుత్వ భాష తెలిసివుంటే చాలు. అయితే జాతీయ అంతర్జాతీయ సంఘటనలను ఆకళింపు చేసుకోవాలని ప్రయత్నించే ఏ సంస్కారవంతుడైన పౌరుడికైనా రాజభాష అవసరం తప్పకుండా కనుపిస్తుంది. విద్యావంతుల సంగతి చెప్పనక్కరలేదు.

ఈ విధమైన ప్రాముఖ్యతవున్న రాజభాషగా 1965 సం॥ నుంచి ఇంగ్లీషును తొలగించి, ఆస్థానే హిందీని ఉంచాలని రాజ్యాంగం ఉద్దేశిస్తున్నది. ఇది జాతి జీవితంలో అత్యంత ప్రముఖమైన సంఘటన; జాతిభవిష్యత్తుకు సంబంధించిన ఒక గొప్ప నిర్ణయము. ఇంతటి నిర్ణయము మనం చేశామూ అంటే, దానికేవో బలవత్తరమైన కారణాలు, తిరుగు లేనివి సహజంగా వుండి వుండాలి. కాని గొప్ప ఆశ్చర్యమేమిటంటే, ఈకారణాల ప్రస్తావన రాజ్యాంగంలో గాని, మరి యే ఇతర అధికార పత్రంలోగాని అణుమాత్రంగా కూడ లేదు. ఎందుకు మనం రాజభాషగా ఇంగ్లీషును తొలగించి హిందీని పెడుతున్నామో బాధ్యతగల ఏ ప్రభుత్వోద్యోగీ, అప్పటి ఏ రాజ్యాంగసభ సభ్యుడూ

చెప్పలేదు. హిందీని క్రమ క్రమంగా ఈవ్యవస్థలోకి ఎలా చొప్పించి, 1965 నాటికి ఈకార్యక్రమము పూర్తి చెయ్యాలి అనే విషయమై బండెడు ప్రభుత్వ వాఙ్మయము వున్నది. ఒక పెద్ద కమిషను వున్నది. సాంస్కృతికరంగంలో తరువాత హిందీ ఎలాంటిపాత్రనునిర్వహించాలి అన్నవిషయమై రాజ్యాంగంలో (351సూ.)సూచింపబడివుంది. కాని ఇంగ్లీషును ఎందుకు తీసివేస్తున్నామన్న వివరణ ప్రభుత్వవర్గాలుగాని, హిందీవిషయమై అమితపట్టుదలను ప్రదర్శిస్తున్న ఇతరవర్గాలుగాని, ఏమేధావిగాని చెయ్యలేదు. ఇదేదో అందరికీ తెలిసినదిగాను, 'నీరు పల్లమునకు ప్రవహించును' అన్నంత సహజంగాను మామూలు విషయంగాను తీసుకుంటున్నారు. ఈ కారణాల్లోకి లోతుగా పోయి, సాకల్యంగా చర్చించి 'ఇందువల్ల మనం రాజభాషగా హిందీనే కోరుకొంటున్నాము' అని శాస్త్రీయంగా, అధికారయుతంగా చెప్పవలసిన బాధ్యత, అవసరం ఇంత చరిత్రాత్మక విషయమై వుండకపోవటం విడ్డూరం కాదా?

ఒక ఉదాహరణ చెబుతాను. శ్రీ యం. పి. దేశాయ్ విద్యావంతులు. గాంధీవాదులు. భాషల విషయమై ఆయన దృక్పథము ఎంత వివేకవంతముగా ఉందో ఒక్క విషయము చెపితే చాలు తెలుస్తుంది. ఒక ఉపన్యాసంలో శ్రీ పురుషోత్తమదాసు టాండన్ గోరక్‌పూర్‌లో ఇలా అన్నారు— 'దేశంలో కొన్ని ప్రాంతాలలో ప్రాంతీయభాషకోసం ఇంగ్లీషు కోసం నినాదాలు వినవస్తున్నవి. ఇవి దేశానికి చాల ప్రమాదకరం. నిజానికి మన కార్యాలయాలలో ఇంకా వ్యవహారం

ఇంగ్లీషునుంచి హిందీకి మార్పురుండా ఉండటంవల్ల దేశస్వా తంత్ర్యానికే ఎంతో ముప్పుకలుగుతున్నది. హిందీ మన నిర్బంధభాషగాను, మరాఠీ, బెంగాళీ, గుజరాతీలాంటి ఇతర భాషలు రెండవభాషగాను బోధించాలి. కాని ఏ పరిస్థితిలోను ఇంగ్లీషు మన నిర్బంధభాషగా ఉండరాదు'. శ్రీ దేశాయి ఈ ఉపన్యాసం విషయమై హరిజన పత్రికలో వివరణ కోరారు. హిందీ మాతృభాషగా ఉన్న ఒక్క ప్రాంతంలోనే హిందీ నిర్బంధంగాను, మరాఠీ, గుజరాతీలాంటి ప్రాంతీయభాషలు రెండవభాషగాను బోధించాలని శ్రీ టాండన్ గారి తాత్పర్యమా లేక దేశమంతా కూడ హిందీ మొదటిభాషగాను, ఆయా ప్రాంతీయభాషలు రెండనభాషగాను బోధించాలని ఆయన ఉద్దేశమా అని సందేహం వెలిబుచ్చారు. అంటే ఆయా ప్రాంతాలలో ప్రాంతీయభాషలకు ప్రథమస్థానము, రాజభాష కానున్న హిందీకి రెండవస్థానము ఇవ్వాలని శ్రీ దేశాయి విశ్వాసం. శ్రీ దేశాయి ప్రస్తుత సందర్భంలో ఏమన్నారో చూద్దాం. 'మనం మనదేశంలో అనేకభాషలు మాట్లాడు తాము. యావద్భారతదేశ వ్యవహారాలకు అంతర్రాష్ట్రీయ వ్యవహారాలకు మనకందుచేత ఒక సామాన్య భాషావాహ కము కావాలి. నిశ్చయంగా అది ఇంగ్లీషుకాలేదు. ఇకఅన్ని ప్రాంతీయ భాషల్లోకి హిందీ అర్హతమమైనది'అన్నారు. నిశ్చ యంగా అది ఇంగ్లీషుకాలేదన్నారు. దాన్నిగూర్చి వేరేచెప్పవల సినదిలేనట్లుగా, చెప్పవలసిన అవసరం లేనట్లుగా. కాని ఎందుకు కాలేదు? ఇప్పటివరకు అది ఆబాధ్యత నిర్వర్తిస్తూనే వుంది

గదా? ఒక్క శ్రీదేశాయ్ మాత్రమేకాదు. దాదాపు ప్రతి విద్యావంతుడు, ప్రతి మేధావి దీనిని గురించి ఆలోచించ కనే, ఒక చెడు అభిప్రాయాన్ని (Prejudice) కలిగి వున్నారు. దీనికి కారణాలు వేరే సందర్భంలో చర్చిద్దాము.

## 2. ప్రచారంలో వున్న కొన్ని అపోహలు

సరే, ఈ విషయమై ఎవ్వరూ శాస్త్రీయమైన చర్చా, నిర్ణయమూ చెయ్యలేదనుకున్నాము. కాని 'రాజభాషగా ఇంగ్లీషును తొలగించి హిందీని వుంచాలి' అని ఎవరేనా అంటున్నప్పుడు, వారి మనసులో సందిగ్ధముగా, అస్పష్టముగా మెలిగే భావాలను ఈ క్రింది విధాలుగా విభజింపవచ్చును :-

(1) ఇంగ్లీషు విదేశభాష; అది జాతీయభాషగా ఉండడమేమిటి, ఊహించరాని విషయము!

(2) హిందీ ఒక రకమైన సాంస్కృతిక సమైక్యతను, దేశంలో సాధిస్తుంది.

(3) ఇంగ్లీషు అతి క్లిష్టమైన భాష; అది సరిగా ఎవ్వరికీ రావడం లేదు.

ఇందులో ఒక్కొక్క అంశాన్నే పరిశీలించి వాటిలో సత్యాసత్యాల్ని పరీక్షిద్దాము.

(1) ఇంగ్లీషు విదేశభాష. అయితే ఏమిటి? ఆ భాషను మనం ఏ కార్యాలకి ఉపయోగించుకోవాలనుకుంటు

న్నాము, ఆ కార్యాలకు అది ఎంతవరకు పనికివస్తుంది ? ఈ విషయమే మనం ఆలోచించాలిగాని, ఈ భాష మనం అనుకున్న కార్యాలకు ఎంత బాగా పనికి వచ్చినా, అది విదేశ భాష అన్న ఒక్క కారణం వల్లే దాన్ని తోసిపారెయ్యాలనటం కేవలము సెంటిమెంటు, మూర్ఖము అవుతుంది.)

(అ) రాజభాష: జాతీయభాష

ఇంగ్లీషు రాజభాష (Official language) గా పనికివస్తుందా రాదా అన్నది సమస్య. ఈ సందర్భములో ఒక పెద్ద అపోహ ప్రచారమయిపోతూవున్నది. రాజ్యాంగం ప్రకారం హిందీ జాతీయభాష కాబోతోందని అందరూ అంటుంటారు. కాని రాజ్యాంగంలో జాగ్రత్తగా 'రాజభాష' అన్న పదం మాత్రమే కావాలని వాడబడింది. 'జాతీయ భాష' అన్న పదం అసలు వాడబడలేదు. ఈ రెండూ ఒకటే అని సాధారణంగా వాడేస్తున్నారు. ఒక భాషకుండే స్వాభావసిద్ధమైన ప్రాముఖ్యత, మిగతా భాషలతో దానికుండే సంబంధాలు, వాటి వాటి relative positions వీటిని అర్థం చేసుకోవడంలో ఈ రెండు పదాల్ని వేరుచేసి చూడవలసిన అవసరం ఎంతైనా వున్నది.

'జాతీయభాష' (National language) అన్నది చాల ఉదాత్తమైన, ఉన్నతమైన సందర్భములో వాడబడుతుంది. ఒక యుగంలో ఒక జాతి ఒక రకమైన జీవిత విధానాన్ని కలిగి వుంటుంది. ఈ జీవిత విధానాన్ని ఒక భాష దర్పణం లాగ ప్రతిఫలింప చేస్తుంది. ఆ జీవిత విధానంయొక్క

బాహ్యస్వరూపము (Expression) 'జాతీయభాష'. ఆ జాతి యొక్క జీవిత విధానం యుగ యుగానికి, ఒక కాలానికి మరొక కాలానికి భిన్న భిన్నముగా ఉండొచ్చును. వీటన్నిటినీ ఆ 'జాతీయభాష' ఎప్పటి కప్పుడు తనలో దర్శింపచేసు కుంటూ వుంటుంది. అంత మహత్తరమైనది 'జాతీయభాష'. ఇండియాఅంతా ఒకే జాతి అనుకుంటే, హిందీ ఎప్పుడూ ఆ జాతికంతకూ ప్రాతినిధ్యము వహించలేదన్నది స్పష్టమే. ఇది భారతజాతి అనేక 'ఉపజాతుల' మేలు కలయిక కావటంవల్లనే. ఇండియాలోని వేర్వేరు భాషలు ఈ వేర్వేరు ఉపజాతులకు ప్రాతినిధ్యము వహిస్తవి. అంటే ఈ వేర్వేరు ఉపజాతులకు 'జాతీయ భాషలు'. అందుచేత ఇండియాను ఒక్కటే 'జాతీయభాష' కాలేను ఎప్పటికీ; ఇండియాలోని అన్ని ప్రాంతీయభాషలూ 'జాతీయ భాష'లే. ఇలాంటి భావానికి మొదటగా రూపకల్పన చేసింది, రష్యాలో విప్లవానంతర నాయకులు. అక్కడకూడ ఈ సమస్య వేరొక రూపంలో ఉద్భవించడంవల్ల వాళ్ళు శమ మేధా నైశిత్యంవల్ల ఈ విషయాన్ని గ్రహించి, ఆచరణలో అన్ని భాషలను ఒకే అంతస్తులో చూశారు.

ఈ రాజభాష విషయమై, హిందీకి పెద్దయెత్తున ప్రచార మివ్వాలనే సంకల్పంతో కేంద్రప్రభుత్వము తీసుకునే చర్యల విషయమై ప్రస్తావిస్తూ, 'త్రివేణి' (జూలై 55) సంచికలో సంపాదకులు ఇలా వ్రాశారు. "రెండోవైపున, గొప్ప వాఙ్మయాలు కలిగివుండి, విశాల భూభాగాలమీద లక్షల

కొద్దీ జనులచే మాట్లాడుతున్న ఇతర భారతీయ భాషలను దెబ్బతీసే పద్ధతిలో, దేశాన్ని త్వరితగతిని 'హిందీమయము' చెయ్యటానికి అవలంబించబడుతున్న పద్ధతులయెడల అనేక 'అహిందీ' రాష్ట్రాలలో అసంతృప్తివుంది. హిందీని 'రాష్ట్ర భాష' లేక 'జాతీయభాష' (National language) అని వ్యవహరించటం సరికాదు. నిజానికి, భారత రాజ్యాంగంచేత గుర్తించబడిన 14 భాషలూ మన జాతీయభాషలే. కేవలం మాట్లాడుతున్న జనాభా బలాన్ని ఆధారంగా చేసుకుని హిందీ పరకమైన అభిజాత్యాన్ని ఆశించరాదు.

ఈ భాషలకు సంబంధించిన సమస్యలలో అత్యంత ఆసక్తిని కనపరుస్తున్న మన రాజకీయ నాయకుల్లో ఒక్క నెహ్రూయే ఈ అంశంయొక్క నిజమైన స్వారస్యాన్ని గ్రహించినట్లు కనబడుతుంది. ఆయన తన అనేక ఉపన్యాసాల్లో "దేశంలోని అన్ని ప్రాంతీయ భాషలూ సమానమే; అన్నీ జాతీయభాషలే. హిందీ రాజభాష మాత్రమే" అని వివరిస్తున్నారు. హిందీని రాజభాషగా మాత్రమే వ్యవహరించిన రాజ్యాంగముయొక్క ఆంతర్యాన్ని లక్ష్యపెట్టకుండా, తరువాత అనేక సందర్భాల్లో కేంద్రప్రభుత్వ హోంశాఖ హిందీని 'జాతీయభాష'గా వ్యవహరించటం ఈ సందర్భంలో గమనార్హము.

ఇంతకు హిందీని మనము తీసుకు రావాలంటున్నది రాజభాషగా మాత్రమే, అంటే కేంద్రప్రభుత్వ అధికార

భాషగా. "దేశంలో ప్రభుత్వ వ్యవహారాలలో ఉపయోగించ టానికి నిర్దేశించబడిన భాషే, ఒక రాష్ట్రానికి మరొక రాష్ట్రానికీ మధ్య, కేంద్రానికి రాష్ట్రానికీ మధ్య సమాచార్ వాహనముగా వుంటుంది". రాజ్యాంగంలోని సాధారణమైన సూత్రాలకు (Articles) సంబంధించినంతవరకు రాజభాషపని ఇది. ఈ కార్యము నిర్వహించటం నిమిత్తం మనం ఇంగ్లీషును తొలగించి హిందీని వుంచవలసిన ఆవశ్యకత ఎందుకొస్తుంది? దీనికి ఇంగ్లీషు విదేశీతనము ఏమీ ప్రతిబంధకము కాలేదన్నది కూడ స్పష్టమే. ఇప్పటివరకు ఇంగ్లీషు ఈ పనిచేస్తూనేవుంది, తన సాంకేతిక పద సమృద్ధితో. ఈ వ్యవహారాలకు, చట్టాలకు కావలసిన పదజాలానికి సంబంధించినంతవరకు ఇంగ్లీషు అర్హత ఎంత గణనీయమైనదో అందరికీ తెలిసినదే. మరి వేల కొద్దీ పదాల్ని ఇప్పుడు హిందీలో సృష్టించి, వాటి నన్నిటినీ ప్రచారంలోకి తేవటానికి ఎంతో శ్రమపడటంలో వున్న సౌకర్యం ఏమిటి ?

(ఆ) విదేశీభాష.

ఇక రెండో విషయము. ఒక భాష విదేశీయమైనది అనటంలో ఉద్దేశ్యమేమిటి? ఆ భాష ఆ దేశంలో మాట్లాడరు, అర్థంకాదు అని. మరి ఒక తెలుగువాడికి, ఒక గుజరాతీయుడికి, ఒక అస్సామీయుడికి హిందీ 'విదేశీయము' కాదా? అవును, ఈవ్యాసము ఒక అహిందీ ప్రాంతీయుడి దృక్పథముతో వ్రాయబడినట్టిది. (వ్యాసం మొత్తంలో హిందీ ప్రాంతీయుల దృష్ట్యాకూడ ఇంగ్లీషు రాజభాషగా వుంచటంలోగల సౌకర్యం, ప్రయోజనం

చూపించటానికి ప్రయత్నము జరుగుతుంది. ఈ అహిందీ ప్రాంతీయులు మనం గణనలోకి తీసుకోదగినంత స్వల్ప సంఖ్యలో లేరు. షుమారు 20 కోట్లు వున్నారు. వీరి దృష్ట్యా హిందీ విదేశీభాషే. ఒక తమిళుడికి సంబంధించినంత వరకు ఇంగ్లీషెంత విదేశీయమైనదో, హిందీకూడ అంతే విదేశీయమైనదని శ్రీ రాజాజీ అభిప్రాయపడ్డారు. వీటిలో ఒకటి ఎక్కువ విదేశీయమని, మరొకటి తక్కువ విదేశీయమని కొందరు వాదిస్తారు. కాని 'విదేశీభాష'కు మనం ఇచ్చిన నిర్వచనందృష్ట్యా, ఈ వాదన పసలేనిది.

(2) "హిందీ ఒకరకమైన సాంస్కృతిక సమైక్యతను దేశంలో సాధిస్తుంది" అని. ఈ భావం చుట్టూ ఎంతో వాగ మంచు దట్టంగా పట్టివుంటుంది సాధారణంగా.

ఈ భావం ముఖ్యంగా రెండు విషయాలకు దారి తీస్తుంది. ఇప్పటివరకూ అంటే హిందీ రాజభాషగా రాబోయ్యే వరకూ దేశంలో సంస్కృతీ సమైక్యతలేమి అన్న అర్థమొకటి వస్తుంది. రెండోది ఇంగ్లీషు సంస్కృతీ సమైక్యతకు ప్రయత్నించలేదనో, లేక విచ్ఛిన్నం చేసిందనో అర్థమొస్తుంది. కాని కొద్ది పరిశీలనచేస్తే ఈ ఉద్దేశాలు ఎంత ఆధారరహితాలో తెలుస్తుంది.

(ఇ) భారతీయ సంస్కృతి: ఇంగ్లీషు

స్థూలంగా, ఒక జాతి ఒక కాలం లో కొనసాగించిన జీవిత విధానమే, ఆ కాలంలో ఆ జాతియొక్క 'సంస్కృతి'. ఆ జీవిత విధానానికి ఆసరాగా అంతర్గర్భితంగా కొన్ని విశ్వాసాలు, విలువలు వుంటవి. వాటిని నిర్ణయించేవి ఆ యా కాలపు దృష్టులు. మతము, దేశము, భాష మొదలైనవి 'సంస్కృతి'కి సంబంధించే వుంటవిగాని, పై విశ్వాసాలు, విలువలువంటి ప్రాముఖ్యత వాటికిలేదు. వేదకాలం లోని భారతజాతి సంస్కృతి—అంటే అప్పటి జీవితవిధానం వెనుకనున్న విలువలు, విశ్వాసాలు— సంస్కృతి భాషలో ఉల్లేఖించబడినవి. కాని ఏవైన చారిత్రక కారణాలవల్ల ఆ భాష ప్రాముఖ్యత తగ్గినా, ఆ సంస్కృతి తాలూకు ప్రభావము ఆజాతి తర్వాత దశల్లో కూడ ఉండనే వుంటుంది. అది భాష, ప్రాంతము మొదలగు వాటికి దాదాపు అతీతమని చెప్పవచ్చు. ఈ విషయాన్నే శ్రీ రాధాకుముద్ ముఖర్జీతమ 'ఫండమెంటల్ యూనిటీ ఆఫ్ ఇండియా' అనే గ్రంథంలో వేరొక సందర్భంలో ఉటంకించారు.

ఇక ఇంగ్లీషు మనల్ని సాంస్కృతికంగా దుర్బలుల్ని చేసిందనటం హాస్యాస్పదము. మహా ప్రభంజనములాగ వచ్చిన ఆంగ్లేయ మహా సారస్వత ప్రభావానికి, దాస్యంలో మగ్గుతూ బిక్కు బిక్కుమంటూన్న విద్యావంతుడు వణకి లొంగిపోయి వుండవచ్చు. ఆభాష తెరిచిన అనంత భౌతిక

ప్రపంచదృశ్యాలను చూసి అతడు దిగ్భ్రమచెంది, న్యూనత ననుభవించి, ఆత్మ విశ్వాసాన్ని కోల్పోయివుండొచ్చు. కాని ఈ దశ అతి తాత్కాలికమైనదని జాతీయోద్యమ చరిత్ర, స్వాతంత్ర్యానంతర చరిత్ర రుజువుచేస్తున్నవి. అదే విద్యావంతుడు తిరిగి ఈనాడు ఇంగ్లీషు అధ్యయనం ద్వారానే తన వారసత్వ మెంత మహత్తరమైనదో, మానవజాతి సాంస్కృతిక చరిత్రలో తన జాతి నిర్వహించిన పాత్ర యెంతో గుర్తించి, ఆత్మ విశ్వాసాన్ని పునరుజ్జీవింప చేసుకుని పురోగమిస్తున్నాడు. తన సంస్కృతీ వారసత్వాన్ని తన భారతీయ వాణిని ప్రపంచానికి వినిపించటానికి ఇంగ్లీషు ఎంత శక్తివంతమైన పరికరమో గ్రహిస్తున్నాడు.

ఇంగ్లీషుద్వారా మనకు పరిచయమైన శాస్త్రీయ పరిశోధనాపద్ధతులవల్ల మన ప్రాచీన సంస్కృతీ అవశేషాల్ని కాలగర్భంలోను, భూగర్భంలోను జీలిస్తున్నవాటిని పునరుద్ధరించుకుంటున్నాము. ఇక ఇంగ్లీషు మన ఐక్యతని ఎలా విచ్ఛిన్నం చేసింది ?

ఇక హిందీ ఈ విషయంలో ఏదో చేస్తుందనుకోవటం కూడ అంతే ఆధారరహితము. మన ప్రాచీన సంస్కృతీ వాసనలను మనం సంస్కృతముద్వారా ప్రత్యక్షముగానే ఆఘ్రాణించగలము. లేక సుసంపన్నములైన మన ప్రాంతీయ భాషలలోకి దాన్ని సులభంగా తెచ్చుకోగలము. ఇక్కడ హిందీ సహాయము—హిందీద్వారా మన సంస్కృతి నాక

శింపు చేసుకునే అవసరం— బొత్తిగా లేదు మనకు. ఇండియాలో దాదాపు ఇతర ఏ ప్రాంతీయ భాషైనా హిందీకంటె వెనుకబడి లేవన్నది జగద్విదితము.

(ఈ) రాజ్యాంగంలోని హిందీ సాంస్కృతిక పాత్ర.

హిందీ రాజభాష అయ్యాక అది నిర్వహించవలసిన సాంస్కృతిక పాత్రను గురించిన ఒక ప్రసక్తి రాజ్యాంగంలో వుంది. దాన్ని ఈ సందర్భంలో పరిశీలించడం అవసరము. "భారతీయ సంస్కృతికి సమగ్రత నాపాదించే వివిధాంశాల అభివ్యక్తతకి సాధనగా అది (హిందీ) ఉపయోగపడేట్టు దానిని అభివృద్ధిపరచటము, దాని ప్రచారానికి దోహదము చెయ్యటము.........కేంద్ర ప్రభుత్వము యొక్క విధి". (It shall be the duty of the Union to promote the spread of the Hindi language, to develop it so that it may save as a medium of expression for all the elements of the composite culture of India.........) అని రాజ్యాంగంలో వుంది. కాని ఇది రాజ్యాంగం అంతా రచించబడిన సాధారణమైన సూత్రాల (Articles) లేదు. రాజభాషకు సంబంధించిన భాగములో 'స్పెషల్ డైరెక్టివ్'గా ఆఖరి సూత్రంలో వున్నది.

అసలు 'భారతీయ సంస్కృతికి సమగ్రత నాపాదించే వివిధాంశాలని' హిందీలోనే వ్యక్తపరుచవలసిన అవసరమేమిటి? అదసలెలా సాధ్యం, ఆ సంస్కృతికి వారసులు 12 భాషల వాళ్ళుంటే? మిగతా భాషలనుంచి వేరుచేసి, హిందీకి ప్రత్యే

కమైన స్థానమివ్వవలసిన ఆవశ్యకత లేదన్నదీ, అన్ని భాషలూ సమానమేననీ, అలాంటి ప్రత్యేకస్థానానికి ఏ ఒక్క భాషా తగదనీ పైనచెప్పిన కారణాలవల్ల స్పష్టమే. ముందు ముందు ఈ విషయం మరింత స్పష్టంకాగలదు.

కాగా ఈ విషయాన్ని గుర్తించే రాజ్యాంగసభ సభ్యులు హిందీకి ప్రత్యేకమైనస్థానాన్నేదీ ఇవ్వదలచక, బహుశా ఆ భాషని మాట్లాడే సంఖ్యాబలం ఆధారం చేసుకుని దానిని 'రాజభాష'గా మాత్రమే నిర్దేశించారు. కాని మరింకేవేవో ఉద్దేశ్యాలు మనస్సులో ఉండబట్టి, హిందీని కనీసం 'జాతీయభాష' అనైనా వ్యవహరించక పోవటాన్ని సహించక, శ్రీ కె. యం. మున్షీ ఎంతో వివాదంపడిన తరువాత ఆపై వుదహరించిన ఇంగ్లీషు వాక్యాన్ని మరొకరితో కలిసి స్వయంగా రచించి రాజ్యాంగసభచేత స్పెషల్ డైరెక్టివ్‌గా ఆమోదముద్ర వేయించారు. ఆయన ఆ విషయం తదనంతర ఉపన్యాసాల్లో స్వయంగా చెప్పారు.

రాజ్యాంగంలో హిందీకిచ్చిన సాంస్కృతిక పాత్రతో శ్రీ మున్షీగారి వ్యక్తిగత అభిప్రాయాలు ఆగవు. మరి ఆయనలో అలాంటి అభిప్రాయాలు ఏ కారణాలవల్ల కలిగినవో చెప్పలేంకాని, అవి చాల భయంకరమైన అభిప్రాయాలని చెప్పవలసి వచ్చినందుకు విచారిస్తున్నాను. హిందీ సాహిత్య సమ్మేళన్ వారికి ఆయన ఇచ్చిన ఒక ఉపన్యాసంలో ఇలా అన్నారు.

"ఉదయపూర్‌లో జరిగిన సమ్మేళన్‌కి అధ్యక్షుడిగా నేను హిందీ ప్రపంచానికి చెప్పిన విషయాలు మీకు జ్ఞాపకం ఉండేఉంటవి. ఇంగ్లండుదేశపు భాష ఇంగ్లీషు అయినట్లుగా హిందీ 'భారతి'గా—భారతదేశపు భాషగా కావాలని అంటున్నాను'.

ఇక వారి ఉదయపూర్ ఉపన్యాసంలోని భాగంఇది:

"హిందీ జాతీయభాష అనే విషయం అలావుంచండి. మన వ్యవహారాలు, రాజకీయాలు కొనసాగే భాషగా 'భారతి' కావాలినాకు. ప్రతి భారతీయుడు ఆ భాషలో వ్రాయాలి, ఆ భాషలో చదవాలి; భారతదేశం తన సారస్వతాన్ని ఆ భాషలో సృష్టించాలి. సరిగ్గా ఇంగ్లీషు ఇంగ్లండుకులాగ, ఫ్రెంచి ఫ్రాన్సుకులాగ, 'భారతి' ఇండియాకు కావాలని కలలు కంటున్నాను".

కాని శ్రీ మున్షీగారి కలలు కలలుగానే ఉండిపోతాయనడంలో సందేహం లేదు. హిందీకాక—ప్రభుత్వంచేత గుర్తించబడి, తమ ప్రత్యేక వారసత్వాన్ని, ప్రతిపత్తినీ అనుభవిస్తున్న పదమూడు నాగరిక భాషలూ మటుమాయం అయిపోయి, ఒక్కే 'భారతి'గా ఎలా రూపొందుతుందో బెనారస్ యూనివర్సిటీ స్నాతకోపన్యాసంలో శ్రీమున్షీగారు సావకాశాల్ని పరిశీలించారు.

"హిందీ తన కర్తవ్యాన్ని నిర్వహించాలంటె సంస్కృతంయొక్క సుందరతా సౌలభ్యాలను, ప్రాంతీయ భాషల

యొక్క శబ్దజాలాన్ని మాత్రమేకాక, ఇంగ్లీషు భాషయొక్క అమేయ శక్తి సంపదల్ని కూడ పరిగ్రహించాలి." (ఈఉపన్యాస భాగాలన్నీ "Our greatest need and other addresses" అన్న పుస్తకంనుంచి)

ఇది ఎంత సౌమ్యంగా చెప్పాలన్నా, భాషాసూత్రాల తాలుకు దారుణమైన అజ్ఞానాన్ని బయట పెడుతున్నది. పూర్వము ఒకే గుంపుకు చెందినవారు చారిత్రిక, తదితర కారణాలవల్ల వేర్వేరు ప్రాంతాలకి తరలిపోయినప్పుడు, వేర్వేరు మాండలికాలేర్పడి కాలక్రమేణా అనేక భాషలుగా రూపొందటం భాషావేత్త లెరిగిన సిద్ధాంతం. కాని మనం కోరుతున్నాం గనుక పది పన్నెండు భాషలుకలిసి, ఒక భాషగా తయారవటం, ప్రతి భారతీయుడు ఆ భాషలో చదవటం, వ్రాయటం, భారతదేశం తన సారస్వతాన్నంతా భాషలో సృష్టించటం ఎలా సాధ్యం? ఇంగ్లండుకు ఇంగ్లీషు లాగ, ఇండియాకు హిందీ కావటం దురూహ్యమేకాక, అసంభవం.

దీన్ని ఇంత వివరించి వ్రాయడంవల్ల, ప్రాంతీయ భాషల్ని నిర్మూలం చెయ్యాలనీ, లేక తెలుగు వాణిని నొక్కి వెయ్యాలనీ రాజ్యాంగమో, లేక హిందీవాదులో ఉద్దేశిస్తున్నారని రచయిత భయపడుతున్నాడనికాదు. ఎంత శక్తీ ఆ పని చెయ్యలేదు. శాతవాహన రాజవంశం, తరువాత మరి కొన్ని రాజవంశాలు ప్రాకృత, సంస్కృత భాషల మోజులో పడి, 1200 ఏండ్లుగా తనని నిర్లక్ష్యంచేస్తూవచ్చినా, ప్రజ

లలో వేళ్ళు తన్నుకుని అప్రతిహతంగా వర్ధిల్లుతూనే వచ్చి, తెలుగుభాష చాళుక్యరాజుల కాలంలో మొదటిసారిగా రాజ భాషాగౌరవంపొందింది, విజయనగర సామ్రాజ్యకాలంలో మూడు పువ్వులూ, ఆరు కాయలుగా విస్తరిల్లి నేటికీ జాజ్వల్యమానంగా వెలుగుతూవుంది. అలాంటి జీవద్భాషను ఏశక్తులూ అడ్డలేవు. అయితే రాజ్యాంగంలో హిందీకిచ్చిన సాంస్కృతికపాత్ర వెనుకవున్న మన సత్వం, బాధ్యతాయుత మైన పదవుల్లోవుండి జాతీయనాయకులుగా చలామణీ అవుతూ వుండే కొంత మంది హిందీవాదుల భాషామాఢ్యం, దురహంకారం పై నుదహరించిన ఈ ఉపన్యాస భాగాలు తెలుప గలవు.

(3) ఇంగ్లీషు క్లిష్టమైన భాష; అందుచేత దానిప్రమాణాలు వేగంగా పడిపోతున్నవి.

ఈ సందర్భంలో, ప్రస్తుత ఇంగ్లీషు బోధనాపద్ధతులు, వాటి లోపాలు తత్సంబంధమైన కారణాలు క్లుప్తంగా పరిశీలిద్దాం.

(ఉ) ఇంగ్లీషు బోధనా పద్ధతులు.

హైస్కూళ్ళలో ప్రస్తుతం ఇంగ్లీషు బోధించబడుతున్న పద్ధతులు చాల లోపభూయిష్ఠంగా వున్నవి. వాచక, ఉపవాచకాల్లో కథలు, చిన్న ప్రశ్నలు, సందర్భాలు, అర్థాలు, ఉత్తరాలు, వ్యాసాలు అన్నీ ఉపాధ్యాయుడు క్లాసులో 'డిక్టేట్' చేస్తాడు. కొన్ని డజన్ల తప్పులతో, విద్యార్థులు వాటిని కంఠస్థము చేస్తారు. చాల ఆదర్శప్రాయ

మైన టీచరైతే ఆ కంఠస్థము చేసిన వాటిని 'కాంపోజిషన్' పుస్తకాల్లో వ్రాయించి, దిద్ది ప్రతివిద్యార్థిలోనూ సాధ్యమైనంత తక్కువ తప్పులతో వాటిని తిరిగివ్రాసే (reproduce) శక్తిని అభివృద్ధిపరుస్తాడు. లేకపోతే అదీ లేదు. ఇక పరీక్షల్లో మిక్కిలి తక్కువ తప్పులతో తిరిగివ్రాసిన వాడిది 'ఫస్టు మార్కు' ఈ విధంగా ఇంగ్లీషు పరీక్ష కుర్రాడి భాషాజ్ఞానాన్ని కాక అతని కంఠస్థముచేసే శక్తిని కొలుస్తున్నవి. స్కూలు ఫైనలు కుర్రాడికి వాక్యంలో కర్తా, కర్మా, క్రియా తెలియవు. ఒక్క వాక్యాన్ని కూడ స్వయంగా అర్థం చేసుకోగల స్థితిలో వుండడు. ఇక ఒక్క వాక్యాన్ని సరిగా వ్రాయటం కాలేజీ విద్యార్థులు లే చెయ్యలేనిపని అనిచెప్పటంకూడ అతిశయోక్తి కాదు.

బాలుడికి విద్యని అతని మాతృభాష ద్వారానే బోధించాలి అన్నది ప్రాథమిక విద్యాసూత్రము. శిశువుకు మాతృస్తన్యం ఎంత సహజమైన ఆహారమో, బాలుడి లేతమెదడుకి క్రమ పద్ధతిలో బోధించే మాతృభాష అంతచక్కటి ఆహారము. చాల తక్కువ సందర్భాల్లో మాత్రమే మనకు ఇంత చక్కటి ఉపమానాలు దొరుకుతవి, ఒక విషయాన్ని పోల్చి చెప్పటానికి. ఇప్పుడు, ఈ విషయం ఎంత ముఖ్యమైనదో, ఒక బాలుడికి తనమాతృభాషలో తగుభాషా పరిచయము లేనిదే రెండో భాషను మొదలు పెట్టకూడదనే విషయంకూడ అంతే ముఖ్యమైనది. కాని సరిగ్గా ఇదేలోపం మనవిద్యా విధానంలో విలయము సృష్టిస్తున్నది. సాధారణంగా అయిదవ

తరగతిలోనే మనకుర్రాళ్ళకు ఇంగ్లీషు అక్షరాభ్యాసం చేస్తారు. అంటే లెక్కప్రకారం ఒక కుర్రాడిని సాధారణంగా అయిదవ యేట బడిలో ప్రవేశ పెడతారనుకుంటే— అప్పటికి పదేళ్ళు వస్తవి. (కాని ఇప్పటి కుర్రాళ్ళు ఎక్కువభాగం ఇంకాముందే పై తరగతుల్లోకి నెట్టబడుతున్నారు.) మన ప్రాథమిక విద్య చాల అరాజకంగా ఉండడంతో పదేళ్ళ కుర్రవాడికి ఒక్కవాక్య ముకూడా మాతృభాషలో తప్పులేకుండా వ్రాయటం రావటం లేదు. ఈ స్థితి మూడవ ఫారంవరకూ దాదాపు అట్లానే వుంటుంది. మరిఇప్పటికి విద్యార్థి ఇంగ్లీషులో కూడా కథలు, వ్యాసాలు చదవ వలసి వస్తున్నది. రెండుభాషల్లోని వేర్వేరు వాక్య నిర్మాణ పద్ధతులు, సమాస రీతులు, జాతీయ ప్రయో గాలు విద్యార్థి లేత మెదడు పట్టుకో లేక పోతున్నది; తప్ప నిసరిగా పాడవుతున్నది.

ఫ్రాన్సులో 14వ సం॥ వచ్చేవరకూ రెండోభాషను మొదలు పెట్టరు. అప్పటికి ఫ్రెంచి దాదాపు క్షుణ్ణంగా కుర్రాడికి తెలిసేస్థితిలో వుంటుంది. జర్మనీలో దాదాపు 11 వ సం॥ లో రెండవ భాషను బోధించటం మొదలుపెట్టినా శైలిలో భేదాలు, భాషలో స్వారస్యం కుర్రాడు గ్రహించే స్థితిలో ఉంటాడంటే, 'కిండర్ గార్డెన్', దశ నుంచి వాళ్ళ విద్యా బోధన ఎంత శిక్షణతో సాగుతుందో మనం అర్థంచేసు కోవచ్చు. ఇలా యూరపులో అనేక దేశాల్లో అనేక రకాల ప్రయోగాలు దాదాపు శతాబ్దంనుంచి చేస్తూనే వున్నారు. ఇతరుల అనుభవం నుంచి నేర్చుకోవటమైనా మనం కనీస

పక్షంలో చెయ్యాలి. ఆదేశస్థులు అంత జయప్రదంగా మాతృభాషను సాధ్యమైనంతతక్కువకాలంలోనే విద్యార్థులకు క్షుణ్ణంగాబోధించగలగటానికి, 'వైట్‌హెడ్' (A. N. white head) తన ప్రామాణిక గ్రంథమైన "ఎయిమ్స్ ఆఫ్ ఎడ్యుకేషన్" లో ఉదహరించిన రెండు ప్రాథమిక విద్యాసూత్రాలు కారణం. అందులో ఒకటి "మరీచాలా విషయాలను బోధించకు"; రెండవది నువు బోధించేదేదో క్షుణ్ణంగా బోధించు'' మన విద్యావిధానంలో మనం సరిగ్గా ఇదేచెయ్యం. ఫస్టు ఫారం కుర్రాడికి మూడుభాషలు నేర్పుతాము, మనం నాల్గవ ఫారం కుర్రాడికి రసాయినక శాస్త్రంలో అధునాతన సిద్ధాంతాల నెక్కిస్తాము. ఫలితంగా మనయావత్తు హైస్కూలు విద్యనీరుగారి పోతున్నది. నిర్జీవంగా వుంటున్నది.

విద్యార్థి మెదడు పెరుగుదలతోకూడ అనేక దశలు వున్నవి. ఒక్కొక దశలో ఒక్కొక్కరకం విషయాలను అది అతి చురుకుగా పట్టివేస్తుంది. ఉదాహరణకు ఒక దశలో లెక్కలకు చాల అనువుగా వుంటుంది. ఆదశలో జాగ్రఫీ, హిస్టరీల లాంటివి దాదాపు తొలగించాలి. ఒక్కొక్క దశలో ఈ రెండో సబ్జక్టు ఎక్కువగా బోధించాల్సి వుంటుంది. మళ్ళీ ఈ దశలో ఒక సంవత్సరము, ఒక్కోసారి 1 1/2 సం॥ కు మించి ఉండవు. విద్యాబోధనకూడ ఒక శాస్త్రముగదా! దానికికొన్ని పద్ధతులు, సూత్రాలు ఉంటవి. అవిమనవిద్యావిధానంలో ఏ మాత్రమూ పాటించ బడడము లేదు.

బోధనా పద్ధతుల్లో ఉన్న ఈ లోపాలు కాక, తదితర మైన కొన్ని విషయాలుకూడ ఇంగ్లీషు ప్రమాణాలు అని వార్యంగా పడి పోవటానికి విశేషంగా తోడు పడుతున్నవి. ఆర్థిక దుస్థితికారణంగా ఉపాధ్యాయులు శ్రద్ధతోనూ, ఉత్సాహంతోనూ బోధించకపోతే, ఎక్కువగా నష్టపడేది ఇంగ్లీషు సబ్జక్టు. ఇప్పుడదే జరుగుతోంది. "ఇంగ్లీషుభాష క్రమంగా దేశంనుంచి తొలగించ బడుతోంది. దానివల్ల ముందు ముందు అట్టే 'ప్రయోజనం' ఉండదు" అనే భావం ప్రజల్లో వ్యాపించడం కూడ దానిప్రమాణాలు దెబ్బతినటానికి మరోముఖ్య కారణం. స్వాతంత్ర్యము వచ్చాక మొత్తంగా ప్రజల్లో వ్యాపించిన ఒకరకమైన 'ఉదాశీనత' (ఏ విషయాన్నీ 'సీరియస్' గా తీసుకోకపోవటము), విద్యార్థి, ఉపాధ్యాయుల సంబంధాలు, పాఠ్యగ్రంథాల రచనలోని అవకతవకలు- ఇవన్నీ మరికొన్ని కారణాలు. ఇవన్నీ ఉటంకించటము, ఇంగ్లీషు భాష సాధారణంగా అనుకునేటంత కష్టం ఏమాత్రంకాదు అని చెప్పటానికే.

ఇవన్నీ ఇలావుండగానే, ఇంగ్లీషు హిందీ భాషల్లో హిందీ సులభతరమని అంగీకరిస్తాము. అయితే ఈ ఒక్క విషయము రాజభాషార్హతని తేల్చివేస్తుందనటం హాస్యాస్పదము. దానిక పరిశలించవలసినవి ఇంతకంటె ముఖ్యమైన అనేక విషయాలు ఉన్నవి.

(ఉ) రాజభాష
రాధాకృష్ణన్
కమిషన్

అందుచేత, 'ఇంగ్లీషుస్థానే హిందీ రాజ భాషగాఉండాలి' అని ఎవరేనా అన్నప్పుడు స్థూలంగావారి మెదడులలోకలిగే "ఊహలను పరిశీలించి, అవి ఏరకంగా నిరాధారమైనవో, నిర్ధారణకు నిలువవో చూశాము. ఇంతకుముందే మనం, "ఇందువల్ల ఇంగ్లీషునుకాదని, హిందీని తెచ్చుకుంటున్నాము" అని అధికారయుతంగా, శాస్త్రీయమైన పద్ధతిలో చెప్పిన వారెవరు లేరని కూడా అనుకున్నాము. అయితే దీనికి రచయితకు తెలిసినంతవరకు ఒకే ఒక్క మినహాయింపు వున్నది; అదికూడా మనఅదృష్టవశాత్తుజాలిలేని రకమైన మినహాయింపు. అదే శ్రీరాధాకృష్ణన్ అధ్యక్షుడుగా ఏర్పడిన, "యూనివర్సిటీ ఎడ్యుకేషన్ కమీషన్ వారు ఉన్నత విద్యనుగురించి ఇచ్చిన నివేదిక. ఈ కమిషన్‌లోని పదిమంది సభ్యులు జాతిజీవనంలో ప్రముఖ పాత్రను నిర్వహించిన లేక నిర్వహిస్తున్నారు. మేధావులు, విఖ్యాత విద్యావేత్తలు, శాస్త్రజ్ఞులు, ఆచార్య పీఠముల నలంకరించిన వారు. ఇట్టి ప్రముఖులు అతిముఖ్యమైన ఈరాజ భాషావిషయంలో ఏమి చెప్పారో తెలిసికోవడం అవసరమవుతున్నది.

ఈ కమిషను ఉన్నతవిద్యా దాని స్వరూపము, స్వభావములను గురించి ఒక ప్రమాణికమైన అమూల్యమైన నివేదికను సమర్పించింది. నివేదికలో ఒక అధ్యాయము "బోధనా వాహకము" (Medium of instruction) అన్నది. విద్యాలయాలలో బోధనా భాషగా ఏది వుండాలి అన్న విషయం చర్చించ

వలసిన సందర్భములో, ప్రాంసంగికంగా కమిషనువారు రాజభాషగా హిందీ వుండవలసిన ఆవశ్యకతను కూడ వివరించారు. వీరి సమస్యయొక్క తీవ్రతను చాల బాగా గుర్తించారు. ఇంగ్లీషు భాషను మనరాజభాషగా ఉంచుకోవటంలో గల లాభాలను నష్టాలను విడివిడిగా వివరించి, బేరీజు వేసి, చివరకు నష్టాలవైపుకే మొగ్గుఎక్కువ వున్నదని తేల్చి ఇంగ్లీషును నిరాకరించాలన్నారు. ముందు "ఇంగ్లీషు" అన్న శీర్షికతో దాని ప్రాశస్త్యాన్ని ఉగ్గడించారు. తరువాత "ఇంగ్లీషుకు ఆక్షేపణలు అన్నశీర్షికక్రింద రెండోవాదాన్ని వివరించారు. ఇప్పుడు మనకు ఈ రెండో చర్చనీయాంశము. అందుకు గాను ఆశీర్షికక్రిందవారు వ్రాసిన భాగాన్ని యధాతథంగా ఇస్తున్నాను. కొంచెంపెద్దదే అయినా దీనికి పాఠకులు మన్నించాలి. అందులో ప్రతిముక్కా అంతయూ విలువైనది. ఆ పాఠంయిది.

"ఇంగ్లీషుకు ఆక్షేపణలు:— ఒకవిదేశీయ భాషను జ్ఞాన సముపార్జనకు సాధనగా వాడటమనేది విద్యాశాస్త్రరీత్యా అనారోగ్యకరము. బోధనావాహకంగా ఒకవిదేశీ భాషను వాడటంలోగలతీవ్రమైన అనర్థాలను లండను విశ్వవిద్యాలయంలో 'కంపేరిటివ్ ఎడ్యుకేషన్' అన్న విషయంలో ఉపన్యాసకుడుగా వున్న డాక్టరు హాన్సు (Dr Hans) ఈమధ్య వెలువరించిన తన పుస్తకములో వివరించారు. ఆయనంటారు: "స్కూలు ప్రవేశించకమునుపు కుర్రాళ్ళు తమ మాతృభాషలో ప్రావీణ్యము సంపాదిస్తారు; వారిరోజువారీ వ్యవహారాలకు, ఇంద్రియాలద్వారా తెలుసుకోబడే అన్నివస్తువులకుదాదాపుగా

గా సరిపోయేంతపదజాలము వారు నిర్మించుకునివుంటారు. ఇక, ఏవో సువ్యక్తముకాని సంబంధాలతోనూ, భావాలతోనూ కూడిన భాషను పూర్తిగా విదేశీవాహకంలో వ్యక్తీకరించబడ్డ దాన్ని—స్కూలులో ఆపై ఆధారం మీదికి ఎక్కిస్తారు. వాళ్ళ మెదడులు బిగువైన రెండుభాగాలకింద విడిపోతాయి—ఒకటి మాతృభాషలో చెప్పబడ్డ సాధారణవిషయాలకు, పనులకు; మరొకటి విదేశ భాషలో వ్యక్తీకరించబడి స్కూలు సబ్జకులకు సంబంధించిన విషయాలకు, భావనాలోకానికి. ఫలితంగా వాళ్ళుస్కూలు భాషలోనేమో ఇంటి వ్యవహారాలగురించి మాట్లాడలేరు; తాము నేర్చుకున్న వాటిని గురించి మాతృ భాషలో చెప్పలేరు."

ఒక్క వ్యక్తిలోనేకాదు, జాతిలోనే ఒకదుష్టచైతన్యము వృద్ధి అవుతుంది. బ్రిటీషు పాలనలో ఇదే జరిగింది, భారత దేశానికి. గతంలో ఇగ్లీంషు ద్వారా నేర్చుకోవటంలో అమితంగా నష్టపోయాము. ఆలోచన మీద, హేతువాదము మీద దృష్టివుంచవలసిన దానికి బదులు, "నెమరువెయ్యటము" లో రాటుతేలాము. విషయాలు, వాటిసత్యాలు తాలుకు జ్ఞానము సము పార్జించటానికి బదులు, శబ్దాలమీద ఒక విధమైన యాజమాన్యం సంపాదించాము. స్వతంత్రాలోచనకి, మాతృభాషలో వాఙ్మయాభివృద్ధికి అది అఘాతము అయింది. మనం అంత దీక్షగా అభ్యసించిన ఆ భాషని సారవంతంచెయ్యలేక మనం నీరసించి పొయ్యాము. ఒకభాష మాట్లాడేవాడు, తద్భిన్నమైన భాషలోని గొప్ప

వాఙ్మయానికీ దోహదంచెయ్యటం అతి సకృత్తుగాజరిగే సంగతి. విద్యావంతులైనవాళ్ళు తమదికాని భాషలో కనపరిచే అభినివేశానికి అనివార్య ఫలితంగా పరిణమించే హీనవాఙ్మయం వల్ల రెండువిధాలుగా నష్టాలున్నాయి— వైజ్ఞానికంగా, సాంఘికంగా, ఎందుచేతంటే, సంస్కృతిని, సంస్కారాన్ని, నిజమైన సౌభ్రాత్రృత్వాన్ని పెంపొందించటంలో ఒక శక్తిమంతమైన పరికరము గొప్ప వాఙ్మయము. ఇంగ్లీషువల్ల ప్రయోజనాలు, ఒకక్రొత్త వ్యవస్థలోనికి మార్పు చెందుతున్నప్పుడు వెంటనే ఏర్పడే కష్టనిష్ఠురాలు ఏమి వున్నప్పటికీ, ఈ విషయంలో సుదూరం పరికిస్తే, మొగ్గుమాత్రం మార్పు వైపే వుంటున్నది.''

అందుచేత, విద్యార్థి జీవితంయొక్క అన్ని దశల్లోను విద్యను మాతృభాషద్వారా బోధించటం ఎంత ఆవశ్యకమో, ఇది ఇట్లా జరగక ఇంగ్లీషు ద్వారా మనం విద్యను అభ్యసించటంవల్ల జాతికెంత తీరనినష్టము కలిగిందో కమిషనువారు సాధికారంగా వివరించారు. ప్రభుత్వభాషగాకూడ ప్రజలభాష లేక పోవటంవల్ల గతంలో రాజకీయంగా దేశానికెంత హాని జరిగిందో కమిషన్‌వారు ఇంతకుముందే పరిశీలించారు:

''... వెనకటిలాగ ముందుకూడ ఇంగ్లీషు రాష్ట్రభాషాస్థానము (State language) లోవుండజాలదు. ఇంగ్లీషు వాడకము ప్రజల్ని రెండు తెగలుగా చీల్చివేస్తున్నది —పరిపాలించే అల్పసంఖ్యాకులు ఒకతెగ, పాలించబడే అసంఖ్యాకులు ఒకతెగ. ఒకరిభాష మరొకరికి తెలియదు; పరస్ప

రము అగమ్యముగా ఉంటారు. ఇదే ప్రజాస్వామ్య రాహిత్యము.''

కాబట్టి, కళాశాల విద్యంతా ఇంగ్లీషులో ఉండటంవల్ల రాష్ట్ర, కేంద్రప్రభుత్వ భాషలు, కోర్టుభాషఅంతా ఇంగ్లీషే కావటం వల్ల జాతి ఆత్మవిశ్వాసాన్ని, స్వతంత్రాలోచనని చాలవరకు పోగొట్టుకుంది. ఈ పరిస్థితి ఇంకా ఇలాగే సాగితే, ఈ ప్రమాదం మరింత తీవ్రతరమవుతుంది గనుక "సాధ్యమైనంత త్వరలో" ఇంగ్లీషుభాష కుద్వాసన చెప్పి, రాజభాషగా హిందీని తెచ్చుకోవాలని కమిషన్ వారితీర్పు.

8 చరిత్ర చేసిన పొరపాటు

ఇప్పుడు మనం ఒక అతిముఖ్యమైన విషయం వద్దకువచ్చాము. ఒకటి ఆలోచించాలి: ఈపైన కమీషను వారు చెప్పిన దానికి, ప్రస్తుతం మనరాజ భాషాసమస్యకు ఏమిటి సంబంధం ? ఇదివరకు ఇంగ్లీషు కళాశాల, విశ్వవిద్యాలయ స్థాయిలలో బోధనావాహకంగాను, రాష్ట్ర, కేంద్రప్రభుత్వ భాషగాను, కోర్టుభాషగాను వుండిదేశంలో అన్నిరంగాలలోనూ స్వైరవిహారం చేసింది. అందువల్ల ఆపై చెప్పిన నష్టాలన్నీ అనుభవించాము. కాని ఇప్పుడు మనం తెచ్చుకుందామనుకుంటున్న "రాజభాష"-అది హిందీ అయినా ఇంగ్లీషైనా ఆపై పనులన్నీ ఏలాగూ చేయబోవడం లేదు. రాజ్యాంగ ప్రకారం, రాజభాష ఒక్క-కేంద్ర ప్రభుత్వ వ్యవహార భాషగా మాత్రమే వుంటుంది. రాష్ట్ర ప్రభుత్వాలు, వాటివాటి ప్రాంతాలలో ఉండే ఒక భాషనుగాని, అంత కంటె ఎక్కువ భాషలను గాని ప్రభుత్వ భాషలుగా

స్వీకరించ టానికి సామర్థ్యము, అధికారము కలిగివున్నది. సాధారణ పౌరుడికి తనకూ, ప్రభుత్వానికీ వుండే వ్యవహారా లలో ఎక్కువ భాగం రాష్ట్ర ప్రభుత్వ కార్యాలయాలతో నేవుంటుంది. అందుచేత ప్రతిప్రాంతంలోనూ ప్రజల భాష, ప్రభుత్వ భాష ఒకటిగానే వుంటుంది. (ఉదాహరణకు, ముందు ముందు ఆంధ్ర ప్రభుత్వ భాష తెలుగు అవుతుంది. అప్పుడు తెలుగు పౌరుడు తాను విదేశ భాషా ప్రాబల్యం కింద వున్నా నని అనుకోడు.)

అట్లాగే విద్యా శాస్త్రదృష్ట్యా, విద్య అన్నిదశల లోనూ విద్యార్థి మాతృభాషలోనే జరగాలని అనుకున్నాము. నిజానికి తమ వాదననంతా సమీక్షచేసి, కమీషను వారు ఈ అధ్యాయం కింద ప్రభుత్వానికి చేసిన 7 సిఫారసులలో 4 వ సిఫారసు ఇట్లావుంది:

4 (i) ఉన్నతసెంకడరీ, కళాశాల దశలలో విద్యార్థులు 3 భాషలతో పరిచయాన్ని కలిగి వుండాలి—ప్రాంతీయ భాష (మాతృభాష), రాజభాష (హిందీ), ఇంగ్లీషు (ఈమూాడ వదానిని, ఆభాషలో పుస్తకాల్ని చదివి అర్థంచేసుకునే సామర్థ్యం అలవడే పర్యతం)

(ii) కొన్నిసబ్జక్టులకుగాని, అన్నిసబ్జక్టులకుగాని బోధ నా వాహకంగా రాజభాషను వాడటానికి అవకాశాన్ని (Option) కలిగిస్తూ, ఉన్నతవిద్యను ప్రాంతీయ భాషద్వారా అభ్యసింపచెయ్యాలి."

అంటే సౌకర్యం కోసం, వైజ్ఞానిక కారణాలవల్ల, రాజ భాషకు, తదితర భాషల నేర్పినా, విద్యంతా మాత్రము మాతృభాషద్వారా బోధించబడాలని ఈ సిఫారసు చెపుతున్నది.

అంటే ఇప్పుడు ఏమి జరిగిందన్నమాట? ఇంగ్లీషు అన్ని జాతీయ రంగాలలోను విశృంఖల విహారము చేసినప్పటి నష్టాల్ని కమీషనువారు చెప్తున్నారు గాని, ఇప్పటి మన క్రొత్త సందర్భంలో — రాజభాషకు మనము ఇచ్చిన అతి నియమిత పాత్రకం దృష్ట్యా, ఇంగ్లీషు, హిందీలలో ఏది ఎక్కువ ఉపయోగకరమో తేల్చలేదు. ఇంగ్లీషు బోధనాభాషగానూ, కేంద్రరాష్ట్రప్రభుత్వ, కోర్టు భాషలుగాను ఉండి దేశాని కింతనష్టము చేసిందికనుక ఇంగ్లీషు పోవాలంటున్నారు. ఆ రూపంలో ఇంగ్లీషు అవశ్యం పోవాలి, పోతున్నది కూడ. ఇప్పుడు మనసమస్య అదికాదు; రాజభాషకు ఇచ్చిన నియమితమైన కార్యరంగాన్ని దృష్టిలో ఉంచుకుంటే, ఆ స్థితిలో మనకు ఇంగ్లీషెక్కువ మేలుచేస్తుందా, హిందీ ఎక్కువమేలు చేస్తుందా అన్నది.

(అ) భారత మేధావి వర్గము. అందుచేత ఈవాదనలో ఒక గొప్ప పొరపాటు వున్నది. ఈ పొరపాటు ఒక్క కమిషను వారివిషయలోనే కాదు, దేశంలో దాదాపు ప్రతి విద్యావంతుడి విషయంలోనూ సత్యమే. దీనినే ఇప్పుడు ఇండియాలో జరిగిపోతున్న "చారిత్రికమైన గొప్ప పొరపాటు" గా నేను పేర్కొంటున్నాను. మనల్ని వందవళ్ళుగా

దాస్యంలో ముగ్గించి, మనజాతి ఆత్మాభిమానాన్ని గాయపర చిన ఇంగ్లీషు జాతిమీద, దానికి సంబధించిన భాషమీద, మనలో అతిసహజంగా ఏర్పడి పోయిన ద్వేషము, ఈనాటి మేధావి వర్గంకూడ ఈ పొరపాటు గుర్తించ కుండా చేస్తున్నది. మరి అంత బలమైనది ఆచారిత్రిక కారణము. కేంద్ర ప్రభుత్వము ఏమిచేస్తున్నా, ఈనాటి భారత మేధావి వర్గం, ఇంగ్లీషును వదలిపెట్టలేక, హిందీని నిండుమనసుతో ఆహ్వానించనూలేక, కాని ఇది జరగక తప్పదేమో అన్న భయంతోనూ ఒక పెద్ద సుడిగుండలో, dilemma లోపడి కొట్టుకుంటున్నది. ఒక పెద్ద ఆపదను, అనివార్యమైనదాన్ని ఎదురొంటున్న మనస్తత్వంతో ఊగిసలాడి పోతున్నది. అటో ఇటో తేల్చి ధైర్యంతో ముందుకు చూడలేక పోతున్నది.

ఇంగ్లీషు భాషకు, తద్వారా మనకు వచ్చిన పాశ్చాత్య నాగరికతకు మనంచేస్తున్న మానసికదాస్యంగా దీనిని చాలామంది చెప్తారు. సమస్య అంత సులభమైనదే అయితే, అది ఇంత తీవ్రరూపం ధరించే ఉండేదికాదు. ఇందులో అనేక విషయాలు కలిసిపోయి వున్నవి. దీనినింకా వివరంగా అర్థంచేసుకోవడానికి మనం గత ఏభై, అరవైఏళ్ళ చరిత్రను క్షణమాత్రం దర్శించ వలసి వున్నది.

**(అ) జాతీయోద్యమ ఫలితాలు.** అరబ్బీ కథలో ఒంటెలాగు, బ్రిటీషువాడు మన ఇంట్లో ప్రవేసించి తాను సుఖాసీనుడై మనల్ని బయట ఎండలోను, వానలోనునిలిపి బండచాకిరీ చేయించుకొన్నాడు. దీనిలోని దౌర్జన్యము, అవమా

నుషత్వము అర్థమైన వాళ్ళు జాతి అభిమానాన్ని, పౌరుషాన్ని కదిల్చారు. జాతిబుస్సున లేచింది; ఇంగ్లీషు జాతిని, ఇంగ్లీషు వాడిని, ఇంగ్లీషు వస్తువులను, ఇంగ్లీషు సంస్కృతిని ద్వేషించి, పగబట్టింది.

అయితే జాతీయోద్యమ పరాకాష్ఠ దశలో, ఈ జాతి అదృష్టవశాత్తు మహోన్నతుడైన నాయకుడుదొరికాడు.ఆయన మహాత్ముడు.దూరదృష్టితో చూసి, "ద్వేషించవలసింది ఇంగ్లీషు వాడినికాదు, ఇంగ్లీషువాడు ఈదేశంలో దేనికి ప్రతినిధిగా ఉన్నాడో, ఆనిరంకుశత్వాన్ని, దౌర్జన్యాన్ని ద్వేషించండి" అని ఆయన చెప్పాడు. అంతేకాదు, ఆయన మేధావి, స్థిత ప్రజ్ఞుడు. సమస్య మూలమెక్కడున్నదో ఆయనకు తెలిసినట్లు మందరికో తెలియదు.

విద్యావిధానము అన్నిదశలలోను, సహజంగా ప్రాంతీయ భాషలకు చెందవలసిన స్థానాన్ని, ఇంగ్లీషు అక్రమంగా ఆక్రమణ చెయ్యటం వల్ల తనభాషలో తనభావాన్ని చెప్పే జన్మ హక్కును విద్యార్థికోల్పోతున్నాడని ఆయన గ్రహించాడు. ఉన్నతస్థాయి భావవ్యక్తీకరణకు కావలసిన యాజమాన్యాన్ని తనదికాని భాషలో సంపాదించుకోవటంలో విద్యార్థి శక్తి యుక్తులన్నీ దారుణంగా వృథా అవుతున్నవి. అందుకే, ఇక్కడ 'మాస్టరు' డిగ్రీ పుచ్చుకుని విదేశాలకు వెళ్ళి 'బాచిలరు' డిగ్రీకి చదవవలసిన స్థితీ, విదేశాల్లో 'బాచిలరు' డిగ్రీల వాళ్ళు వ్రాసిన పుస్తకాలు, ఇక్కడ అనేక సబ్జక్టులలో 'మాస్టరు' డిగ్రీకోర్సులో బోధించవలసిన స్థితీ ఏర్పడింది. ఈ

స్థితిని ఆయన మేధ ఎంత నిశితంగా గ్రహించిందో ఈ కింది కొన్ని వ్యాస భాగాలు తెలుపగలవు.

"ఇంగ్లీషుభాష ఇప్పుడు నేర్పబడుతున్న పద్ధతిలో, ఆంగ్లేయ విద్యావంతుడైన భారతీయుడిని నిర్వీర్యుణ్ణి చేస్తోందని నా నిశ్చితాభిప్రాయము. భారత విద్యార్థుల మానసికశక్తిని అదిగొప్ప హింసకులోనుచేస్తున్నది. ఇంకా, మనల్ని అనుకరణ శీలురుగా చేస్తోంది." వాళ్ళనిత్య జీవితంలో ఏమాత్రం ఉపయోగం లేనిదాన్ని, తదభ్యసన కారణంగా తమ మాతృభాషని, స్వంత వాఙ్మయాన్ని కాలదన్నవలసివస్తున్న స్థితిలో "ఒక విదేశీభాషలో, దాని నుడికారంలో యాజమాన్యాన్ని సంపాదించటానికి వేలాది యువకులు ఎన్నో సంవత్సరాలు వృథా చెయ్యటంవల్ల, జాతి కెంత అపారమైన నష్టము వాటిల్లుతోందో ఎవరు అంచనా వెయ్యగలరు? అభివృద్ధికిగాని, శాస్త్రీయమైన, సంక్లిష్టమైన భావాల్ని వ్యక్తీకరించటానికిగాని, ఒకానొక భాష అసమర్థమైనది అని అనుకోవటంకంటె పెద్ద మూఢనమ్మకం ఇదివరలో ఎన్నడూలేదు."

ఒకశిశువు శరీరాభివృద్ధికి మాతృస్తన్యము ఎంత సహజమైనదో, ఒకమనిషి మానసికాభివృద్ధికి మాతృభాష అంత సహజమైనదని పయోజనవిద్యను సారథ్యం చేస్తున్నవాళ్ళు, తాము తలచుకొన్న మరుక్షణం గ్రహించ గలరనటంలో నాకెటువంటి సందేహం లేదు.

"ఏది ఏమైన సరే, ప్రాంతీయభాషలకువాటి న్యాయమైనసాధనాన్నిచ్చి,బోధనవాహకాన్ని వెంటనేమార్చేయ్యాలి. ప్రతినిత్యం జరిగిపోతున్న ఈదారుణమైన నష్టానికంటె, ఉన్నతవిద్యలో తాత్కాలికంగా అరాజకమేర్పడినా నాకుఇష్టమే."

'హరిజన్', 'యంగ్ఇండియా' లుకార్యరంగాలుగా గాంధీజీ జాతికీ సందేశాలు ఇస్తూండేవారు. విద్యారంగంలోలాగే, ప్రభుత్వస్థాయిలో కూడ ఇంగ్లీషుభాషపోయి దేశభాషలురావాలనే ఆయన అభిప్రాయాలకి అప్పటి ప్రత్యేక పరిస్థితుల ప్రభావం కొంతవుండేది.

"పర్షియన్ లేకనాగరి లిపులలో దేనినైన వ్రాయటానికి అవకాశం (option) వుంటూ, ఇండియాకు హిందీ సార్వజనీన భాషగావుండాలి".

జాతీయోద్యమాన్ని విజయవంతం చెయ్యడానికి, ఏనాటికైనా ఇండియాలో ఒక శ్రేయోరాజ్యస్థాపన జరగటానికి, హిందూ ముస్లిముల ఐక్యత ప్రధాన అవసరమని అప్పుడు భావించబడింది. పాకిస్థాన్ ప్రత్యేక నిర్మాణం అప్పటికెవరూ ఊహించలేదు. అందుచేత రాజభాషను రెండు లిపులలో— పర్షియన్, నాగరిలిపులలో వ్రాయటానికి అవకాశం ఉండాలని గాంధీజీ అభిప్రాయపడ్డారు. పాకిస్థాన్ నిర్మాణంతో ముస్లిముల యెడలకొన్ని ప్రత్యేక బాధ్యతల్నించి మనం విముక్తి అయిన కారణంగా, రాజ్యాంగ సభ్యులు మారిన పరిస్థితులదృష్ట్యా ఒక్క దేవనాగరి లిపిని మాత్రమే గుర్తించారు. ఈ విధమైన ఆలోచన ఇంకా ఇతర విషయాలలో కూడ ఉండాలి. అప్పుడు

రాజభాష కింతపరిమితమైన కార్యరంగం ఉంటుందనీ, ప్రాంతీయ భాషలు వాటివాటి ప్రాంతాలలో ప్రభుత్వ భాషలుగా వుండడంద్వారా ప్రభుత్వ యంత్రాంగానికీ, ప్రజలకీ ఒక అవిచ్ఛిన్నమైన, సజీవసంబంధాన్ని నెలకొల్పడానికి సిద్ధ పడతాయనీ ఒక అభిప్రాయం ప్రజలలోలేదు. స్వాతంత్ర్య వాయువులు పీల్చనున్న భవిష్యద్భారత దేశంలో ఇంగ్లీషీ అధికారంగా భావించబడుతున్న దుర్దినాలు అంతరించి, భారతీయ భాష, అశేష ప్రజానీకం మాతృభాష గాగల భాష—హిందీ, "జాతీయభాష" గా అవతరించి, సంస్కృతీ సమైక్యతని సాధించి, దేశాన్ని సుందరస్వప్నంగా మారుస్తుందని కలలు గన్నారు. ఆ కలలకి కార్యకారణ సంబంధముతో పనిలేదు. ఈపై భావాలు ఏ విధంగా కేవలం 'సెంటిమెంట్లో' ఇదివరకే చూశాము.

పైగా, రెండువందలయేళ్ళు బ్రిటీషు జాతికింద నీచమైన కఠినదాస్యం చేసిన భారతదేశం, స్వాతంత్ర్యానంతరం తిరిగి అదేజాతితో తనఔన్నత్యం కారణంగా ఇంత సత్సంబంధాలు నెరపగలదనికాని, ఇంగ్లీషు "ఇంగ్లీషు వాళ్ళభాష" అన్న ఒకకారణం గానే దానిని ద్వేషించ వలసినస్థితిమాకుతుందని గాని ఆవేళ ఎవ్వరూ అనుకోలేదు. కాని ఆమార్పులు వచ్చినవి. ఇప్పుడు. ఏవోద్వేషాలు, అపోహాలు వదలిపెట్టి సౌకర్యం మాత్రమే దృష్టిలో ఉంచుకుని నిర్ణయాలు చేసుకోవాలి మనం.

అందుచేత ఇప్పుడు రాజభాష హిందీ అయినా, ఇంగ్లీషయిన— ప్రభుత్వవ్యవహారాలు ప్రజలభాషలలో జరగాలన్న గాంధీగారి అభిప్రాయానికేమీ భంగంరాదు. హిందీవాళ్ళైన, గుజరాతీయులైన, అస్సామియులైనా, అరవవారైనా వారివారి ప్రాంతీయ భాషల్ని రాష్ట్రప్రభుత్వ భాషలుగా కలిగివుంటారు. వ్యవసాయం ప్రధానమైన ఈ దేశంలో సామాన్యుడికి రాష్ట్రప్రభుత్వము తోనే ఎక్కువ సంబంధము. ఇక కేంద్రప్రభుత్వము ప్రత్యక్షంగా. ప్రజలను పాలించే దేమీఉండదు— ఏ 'మణిపూర్' త్రిపుర లాంటి అతిచిన్న ప్రాంతాన్ని మినహాయిస్తే.

కాగా బోధనాభాష విషయంలోగాని, ప్రభుత్వభాష విషయంలోగాని— ప్రాంతీయ భాషల్ని వాడాలన్న గాంధీగారి అభిప్రాయాల వెనుక ఎంత శాస్త్రీయమైన విద్యాసమస్యల పరిష్కారము వున్నదో చూశాము. కాని గాంధీగారి సందేశంలోని ఆంతర్యం ఆయన అనుచరవర్గంలోనే ఎక్కువ మందికి అవగాహనకాలేదు. వారికి ఇంగ్లీషు వాడెంత శత్రువో, వీడికి సంబంధించిన ఏ వస్తువైనా అంతే శత్రువు. ఇంగ్లీషువాడు మన సంస్కృతిని ధ్వంసం చెయ్యటానికి కంకణం కట్టుకొన్నాడు. మనవాళ్ళు పాశ్చాత్యవ్యామోహం లో పడిపోతున్నారు. మన విజ్ఞానం, సంస్కృతి అన్నీ ధ్వంసం అయిపోతున్నవి. ఇలాంటి వేవో చీకటిలాంటి భయాలతో, అపోహాలతో ఈ వర్గంవారు ప్రజలలో ద్వేషమే దేశభక్తిగా ప్రచారం చేశారు. బ్రిటీషు వాడిని ద్వేషించటానికి, ఇంగ్లీషు

భాషను బహిష్కరించటానికి గలవ్యత్యాసాన్ని చూడగల ఓపిక, తీరిక హాసహజంగానే ఆ స్వాతంత్ర్యోద్యమంలో లేవు.

(ఇ) సమస్యను పెడత్రోవ పట్టిస్తున్న వర్గాలు.

అయితే ఆవర్గం వారి ప్రాబల్యం స్వాతంత్ర్యోద్యమముతోనే అంతమయితే, మనం ఇంకా సమస్యల్ని మరింత స్పష్టంగా అర్థంచేసుకోగలిగే వాళ్ళం. కాని దురదృష్టవశాత్తు, ఆవర్గ ప్రాబల్యం అటు కేంద్ర ప్రభుత్వంలోనూ, ఇటు దేశంలో ప్రముఖ స్థానాలలోనూ కూడ ఇంకావుంది. విద్య అన్ని దశలలోనూ మాతృభాషద్వారా బోధించాలనేది విద్యాశాస్త్ర సమస్య. ఆసమస్యని ఈ వర్గంవాళ్ళు రాజకీయాలతోను, సంస్కృతితోనూ లంకెపెట్టి సమస్యల్ని తెగనీయక, అరాజకం చేస్తారు. ఉదాహరణకు, బొంబాయి రాష్ట్రంలోవున్న వేర్వేరు విశ్వవిద్యాలయాలకు బొంబాయి ప్రభుత్వము వ్రాసిన లేఖ(1951 లో) చూడండి. కళాశాలలో బోధనా వాహకం ఏది వుండాలి అన్న విషయంలో విశ్వ విద్యాలయాలను, ప్రభుత్వ విధానాలకు అనుగుణంగా నిర్ణయాలు చేయమని ప్రభుత్వం కోరుతున్నది;

"...ఇదికాక, భారత రాజ్యాంగంలో ఏర్పాటు చేసినట్లు, మన జాతీయ జీవనపు అన్ని రంగాలలోనూ ఆఖరిపక్షంగా 1965 లోపల ఇంగ్లీషు స్థానాన్ని హిందీ ఆక్రమించాలంటే, కళాశాల విద్యలో హిందీని బోధనా వాహకంగా అంగీకరించటమనేది, ఇంగ్లీషునుంచి హిందీకి జరిగే మార్పిడిని, సులభం చేసే మార్గంలో మనం వేసే మొదటి అడుగులలో ఒకటిగా కనుపిస్తోంది".

మన రాజ్యాంగంలో " మనజాతీయ జీవనపు అన్ని రంగాలలోనూ" ఇంగ్లీషుస్థానాన్ని హిందీ ఆక్రమించాలని వున్నదా? సత్యాన్ని వక్రించేసి చూడటమంటే ఇదే. హిందీని కేంద్ర ప్రభుత్వ వ్యవహారాలకు, అంతర రాష్ట్రీయ వ్యవహారాలకు పరిమితం చేసింది రాజ్యాంగం.ఇక బోధనా వాహకం గురించి ప్రస్తావనే లేదు రాజ్యాంగంలో.

భారతదేశంలో విద్యనంతా ఇంగ్లీషుద్వారా బోధించాలని సిఫారసుచేసి మెకాలే భారత విద్యార్థుల ఆలోచనా పటిమను దుర్బలంచెయ్యడంలో కృతకృత్యుడయ్యాడు. ఇప్పుడు స్వాతంత్రభారత దేశంలోకూడ, ఆ స్థానాన్ని ప్రాంతీయ భాషలు సహజంగా ఆక్రమించవలసివుండగా, హిందీని ప్రవేశపెట్టి తిరిగి ఆ "మెకాలే సంప్రదాయాన్ని" కొనసాగించాలని బొంబాయి ప్రభుత్వం ఆలోచిస్తున్నదన్న మాట. ఈ "మెకాలే సంప్రదాయాన్ని'' శ్రీ యం. పి. దేశాయ్ తీవ్రంగా విమర్శించారు. బొంబాయి ప్రభుత్వ 'సలహా' ను త్రోసివేసి, గుజరాతు విశ్వవిద్యాలయం బోధనావాహకంగా గుజరాతీ వుండాలని (ఏప్రిల్, 54లో) తీర్మానం చేసింది.

మనకు ఇదివరకే పరిచయమైన శ్రీ కె. యం. మున్షీ గారు "బరోడా విశ్వవిద్యాలయ నివేదిక" (27 వ పేజీ) లో తమ 'నోట్' లో ఇలాపేర్కొన్నారు:

"దురదృష్టవశాత్తు, ప్రాంతీయ తత్వముప్పద్ధిలో వుంది. దేశాన్ని భాషారాష్ట్రాలుగా విభజించాలనే కోరిక బాగా ప్రచారంలోకివచ్చింది. దీనికితోడు, ఒక ప్రాంతీయభాషను

ఉన్నత విద్యావాహకంగా ప్రవేశపెట్టామంటే, అది ప్రాంతీయ ప్రత్యేక తత్వాన్ని బలపరుస్తుంది; విచ్ఛిన్న కరశక్తుల్ని ప్రేరేపిస్తుంది; జాతిపురోభి వృద్ధిని ఆటంకపరుస్తుంది".

బొంబాయి ప్రభుత్వంలాగానే, శ్రీమున్షీకూడ విద్యా సమస్యను, విద్యాసమస్యగానే చూడటంలేదు. దానిని దేనితోనో ముడిపెట్టి, సమస్యను పెడత్రోవ పట్టిస్తున్నారు. ఇలాంటి విధానాలు ఆచరణలోకి రాకుండా చూడటానికి ప్రతివిద్యావంతుడు అప్రమత్తతతో వుండాలన్నది స్పష్టమే

(4) ఇంగ్లీషు వల్లకలిగే ప్రయోజనములు

అందుచేత ఇంగ్లీషిదివరలో ఏవోనష్టాలు చేసింది కనుక అదిప్పుడు రాజభాషగా ఉండకూడదనే వాదనలోపొరపాటువున్నదనీ, రాజభాషకు మనమేర్పరిచిన పరిమిత ప్రయోజనాల దృష్ట్యా మనకు హిందీ, ఇంగ్లీషులలో ఏది సౌకర్యమెా ఆలోచించుకోవాలనీ, ఇంగ్లీషంటేవున్న దురభిప్రాయాల్ని, భయాల్ని, అపోహాల్ని వర్జించి, సమస్యను సాకల్యంగా పరిశీలించాలనీ దీనిసారాంశం. ఇప్పుడు హిందీ,ఇంగ్లీషుల ప్రాశస్త్యమేమిటో, ఇంగ్లీషుఇదివరలోఎంతనష్టము చేసినప్పటికీ, దానివల్ల మనకు జరిగిన మేళ్ళేమిటో పరిశీలిద్దాం. ఇక్కడ ఇంగ్లీషువాడు ప్రవేశపెట్టిన ప్రజాస్వామ్య విధానం, రైళ్ళు, డాములు గాక ఇంగ్లీషు భాష ద్వారా మనకు పరిచయమైన కొత్త పుంతలు — భావాలలోని, భాషలోని — పరామర్శించాల్సి వుంటుంది. ఇవి ప్రధానంగా అయిదు శీర్షికలుగా విభాగించ వచ్చును.

అ) హేతువాదము లేక శాస్త్రీయ దృక్పథము
ఆ) శాస్త్రవిజ్ఞానము
ఇ) (ప్రాచ్య, పాశ్చాత్య) సంస్కృత సమ్మేళనము
ఈ) నూతన సాహిత్య రీతులు.
ఉ) అంతర్జాతీయ దృక్పథము.

వీటిని గురించి ఈరచయిత చెప్పేది ప్రత్యేకంగా ఏమీలేదు. అన్నీ ఆయారంగాలకు చెందిన ఉద్దండులు ఇదివరకే ఎంతగానో చర్చించి, లెక్కలు కట్టి మనకు చెప్పి వుంచారు. వాటిని రేఖా మాత్రంగా స్పృశించటం ఇక్కడ సందర్భోచితము.

## అ) శాస్త్రీయ దృక్పథము

"నిర్ధారణకు నిలిచేదే సత్యము. ఏవిషయాన్నైనా నిర్ధారణకు పెడితే, దాని సత్యాసత్యాలు తెలుస్తవి. అంతేగాని ఏవిషయంలోనూ ముందు ఏర్పరచుకొన్న అభిప్రాయాలతో బయలుదేరకూడదు." అని స్థూలంగా చెపుతుందీదృక్పథము. వెలుగును వెలుగుగాను చీకటి చీకటిగాను తోపింపచేసి, జీవితంలో సరైన విలువలను పాదుకొల్పుతుంది.

ఈ దృక్పథము యొక్క ప్రభావము సుమారు 75 సం॥ నుంచీ ఈ జాతిమీద ప్రస్ఫుటంగా కనుపిస్తోంది, అన్ని రంగాలలోను. కోళ్ళ పెంపకము వద్దనుంచీ, స్త్రీలసమాన హక్కులవరకు మనం అన్ని రంగాలలోను సరైన దృష్టితో వ్యవహరించే విచక్షణా జ్ఞానం కలిగింది. సతీ సహగమనము

మానగలిగామన్నా, శిశుహత్యను నిరోధించామన్నా, బాల్య వివాహాల్ని తగ్గించ గలిగామన్నా ఈ శాస్త్రీయ దృక్పథము యొక్క అవగాహన వల్లనే.

ఇక సాహిత్య, చరిత్రాది శాఖల్లో పరిశోధనకూడ మున్నెన్నడూ ఎరుగనటువంటి శాస్త్రీయపద్ధతుల్లో విజయ వంతగా సాగి, మనకు సరైన చరిత్రజ్ఞానాన్నిస్తున్నది.

ముఖ్యంగా సాంఘిక రంగంలో, ఇంగ్లీషు భాషా సంపర్కమువల్ల మనకేర్పడిన ఈ దృక్పథము, ఎంత అగణిత మైన ప్రభావాన్ని ఏర్పరచిందంటే, ఈవిప్లవభావాలకు పుట్టి నిల్లయిన ఇంగ్లీషుభాషే విప్లవభాష అనిపించింది.

(ఆ) శాస్త్రవిజ్ఞానము:

శాస్త్రవిజ్ఞానం ఆధునిక జీవితంలో ఎంత బ్రహ్మాండ మైన విప్లవం తెచ్చినది వర్ణించటానికి మాటలుచాలవు. సృష్టి లోని పదార్థము లోని రహస్యాల్ని ఛేదించి, ప్రకృతి సంపద లమీాద మానవుడు ఎంత తిరుగులేని అధికారాన్ని కైవసం చేసుకోవచ్చునో ప్రపంచాని కెరుకపరచిన మొదటి శాస్త్ర విజ్ఞాన పరిశోధన ఫలితాలు 18 శతాబ్దపు భావాన్ని విశే షంగా ప్రభావితంచేసి 'భౌతికవాదం' (Materialism) అన్న కొత్త తత్వానికి దారితీసినవి.

20 శతాబ్దములో ప్రపంచ జనాభా ఒకపెద్ద సమస్య. ఇంత జనాభాకి కనీస వైద్యసౌకర్యాలు అందుబాటులో వుండేట్లు చూడాలంటే, అవి ఈ శాస్త్రవిజ్ఞానంవల్ల తప్ప సాధ్యం అయ్యేదికాదు. కొన్ని పశ్చిమ దేశాల్లో రోగవ్యాప్తిని

అరికట్టి, సరాసరి ఆయుః ప్రమాణాన్ని విశేషంగా పెంచ టంలో అత్యద్భుతమైన విజయాలు సాంధిచారు.

ప్రజాస్వామ్యము, సమ సమాజము వంటి భావాలు ప్రచారంలోకి వచ్చిన మానవచరిత్రయొక్క ఈ ఘట్టంలో, నాగరిక వ్యక్తియొక్క కనీసఆధునిక అవసరాలే ఎంతో ఎక్కు వగావుంటున్నవి. ఈ అవసరాల్ని సంతృప్తికరంగా పరిష్క రించటంలో అత్యవసరమైన 'ప్లానింగు' కి 'సైన్సు' అవసరం, అపారం.

ఫిజిక్సు, కెమిస్ట్రీ, జెనిటిక్స్, ఫిలాసఫీ, ఎకనమిక్సు, పాలిటిక్సు, సైకాలజీవంటి అనంతమైన శాస్త్రాల్ని మనముం దుంచి, మానవుని బహిరంతర ప్రపంచాల్లోని విశ్వరహస్యాల్ని తోపింపచేస్తున్నది, సైన్సు.

ఇలాంటి శాస్త్ర వాఙ్మయ సంపద ఇంగ్లీషు భాషకెంత ఎక్కువో, మిగతా అన్ని ప్రపంచ భాషలకంటె అవి ఎంత ముందుకు వుందో తెలిసికోవటానికి ఈక్రింది అంకెలు తోడ్పడ గలవు.

" 'ఎనలిజికల్ కెమిస్ట్రీ' అన్న శాస్త్ర రంగం లో ప్రకటించ బడిన పరిశోధకవ్యాసాల గురించి ఈమధ్య జరిగిన పర్యవేక్షణలో, 100కి 44 ఇంగ్లీషులోను, 15 ఫ్రెంచిలోను, 11రష్యనులోను, జర్మను, జాపనీసు, స్పానిషు, ఇటాలియను, పోర్చుగీసు, స్వీడిష్, డచ్, హంగేరియను భాషల్లో 6 నుంచి 8 వరకూను ప్రకటించ బడుతున్నట్టు తెలియివచ్చింది.

అంత సార్వజనీన భాష ఇంగ్లీషు. అన్నిశాస్త్రాలకు సంబంధించిన సాంకేతిక పదజాలము, ఎన్నో భాషలనుంచి ఒక క్రిమాన్ననుసరించి సేకరించుకుని విశాలమయిన భాష అది. ఈనాడు ఆ భాషలోవున్న శాస్త్ర వాఙ్మయము, దాని తాలూకు సాంకేతిక శబ్దాలు ప్రాంతీయ భాషల్లోకి రావటము ముమ్మాటికీ అసాధ్యము అనే ఒక్క కారణంకోసం దేశంలో వున్న శాస్త్రజ్ఞులందరూ కళాశాల, విశ్వవిద్యాలయ రంగాల్లో బోధనావాహకంగా ఇంగ్లీషును తప్పించటం ఆత్మహత్యా సదృశము అన్నంత భయంలో వున్నారంటే, ఆ భాషలో వున్న పదజాలము ఎంతసమృద్ధిలోవుందో, దానినుంచి మన ప్రాంతీయ భాషల్లోకి ఎన్నివేలపదాలు మక్కీకి మక్కీకి మనము తెచ్చుకోవలసిన అవసరం వుందో, మనకు అర్థమవుతుంది. వివిధ శాస్త్రబోధనలో ఏఏ సందర్భాల్లో ఏపదాన్ని మనం ప్రాంతీయ భాషల్లోకి మార్పులేకుండా తెచ్చుకోవచ్చునో సూచించే గ్రంధాలు ఆ యా పండితులచేత ఈనాడు దేశం నలుమూలలా ప్రకటించ బడుతున్నవి. యూనివర్శిటీలు అక్కడక్కడ ఏర్పరచిన కమిటీలు కూడ ఈ విషయంలో ఎన్నో సూచనలు చేసివున్నవి.

ఇలాంటి భాషా సంపర్కము మనం పూర్తిగా విసర్జించాలని ఈ శాస్త్రయుగంలో ప్రయత్నించటం ప్రమాదకరమో, కాదో మనం ఆలోచించుకోవాలి.

ఈ రంగంలో మిగతా ప్రాంతీయ భాషలన్నీ ఏస్థితిలో వున్నవో, హిందీ కూడ ఆ స్థితిలోనే వున్నది. అది ఎవ్వరికీ చెయ్యి గలిగిన సహాయమేమీలేదు.

(ఇ) ప్రాచ్య, పాశ్చాత్య సంస్కృతీ సమ్మేళనము:

చైనా, ఈజిప్టు, ఇటలీ, ఇండియా, గ్రీస్ వంటి దేశాలలో మానవజాతి చరిత్ర యొక్క వివిధ ఘట్టాలలో ఉజ్జ్వలమైన 'నాగరికతలు' వెలసి, పరిఢవిల్లినవి. అయితే, గవీంద్రుడు 'సాధన' అన్న నాటకంలో సూచించినట్లు, ఈ 'నాగరికత' కంటె విశాలమైన అర్థములో రెండే రెండు 'సంస్కృతు'లు ఇప్పటికీ ఎప్పటికీ విశ్వజనీనమై నిలిచినవి. ఒకటి గ్రీసుదేశం చవిచూపినది; రెండవది భారతదేశం. స్థూలంగా, ఒకటి వ్యక్తి నిష్ఠమైనది; రెండవది సంఘ నిష్ఠమైనది.

వ్యక్తుల సమూహామే సంఘము కనుక, వ్యక్తి సర్వతోముఖ విలసనమే సంఘవున్నతి. వ్యక్తి సంపూర్ణ వికాసము కంటె ఉదాత్తమైన ఉన్నతమైన పరమార్థము మరొకటి లేదు. దీన్ని అంగీకరిస్తే వెంటనే వ్యక్తి స్వేచ్ఛకంటే విలువైన పదార్థము మరొకటి లేదు అని గ్రహించాలి. భిన్న భిన్న వ్యక్తులలో అంతర్భూత మైవున్న మహాశక్తుల్ని ప్రస్ఫుటీకరింపచేయటమే సంఘం చెయ్యవలసిన పని. ఈవిధంగా ఒక సంస్కృతి విశ్వసిస్తుంది.

సంఘానికి సంబంధించిన ధర్మమే వ్యక్తి ధర్మము. వ్యక్తి అంటూ ప్రత్యేకంగా ఎక్కడావేమీ లేదు. నాలో వున్న మూలపదార్థమే నీలోనూ వున్నది. మూడో వాడిలోనూ వున్నది. ఒక రాయిలోని వివిధ రేణువులు ఈ వ్యక్తులు ఒకే ధర్మాలతో ఉన్న వివిధ రేణువులను ఏదో ఐక్యతా సూత్రము బాధిస్తే ఒక శిలఅయినట్లు, మనందరిలోనూ ఉన్న ఒక్క పదార్థము అట్టి

జాన్ని ప్రోద్బలపరుస్తుంటే, మనమొక ఐక్యతాభావాన్ని జీవింపచేస్తే ఆనందం సాక్షాత్కరిస్తుంది. ఈవిధమైన విశ్వాసం రెండో సంస్కృతిలో వున్నది.

ఇంతకీ వ్యక్తి, సంఘమూ వేర్వేరుకావు. పరస్పరాశ్రియాలు. ఈ పైరెండు సంస్కృతుల్ని సమ్మేళన పరిచడంలోనే ఏనాటికైనా విశ్వశాంతి, మానవ కళ్యాణం ఆధారపడి వున్నాయని హక్స్‌లే, రాధాకృష్ణన్ లాంటి అనేకులైన తత్వవేత్తలు మనకు విశదీకరిస్తున్నారు.

నిజమే, ఒకనాటి భారత దేశములోని జీవితము అత్యున్నతములైన విలువల్ని ఉపాసించింది. ఇదిఒకవిషాదకరమైనసత్యము. మరిఒకసత్యముకూడఉంది. వెనకటి పరిస్థితిమనకిప్పుడు లేదు. వెనకటివైభవాన్ని కోల్పోయిన మనం, అసలుజవంజీవం పోయాక మిగిలివున్న శవంలాంటి పిచ్చివేదాంతాన్ని నమ్ముకుని, జాతి గామనల్ని రగిల్చే ఒక ఆశయం, ఒక ప్రేరేపణ లేక, దిక్కుతోచక అంతఃకలహాలతో దుర్బలులమై ఆత్మవిస్వాసాన్ని కోల్పోయిన పర్యవసానంగా రెండు శతాబ్దాల కాలం హేయమైన దాస్యంచేశాం. మూడు మిఠాయి ఉండలున్న ఒక గదిలో ముగ్గురుకుర్రాళ్ళుండి, అందులో 2½ ఉండలుఒకడూ, ½ ఉండ ఒకడూ, వాటిమీదిగాలినిమూడోవాడు భక్షిస్తుంటే చూస్తూ ఆవ్యవస్థను మనపిచ్చి నమ్మకాలతో సమర్ధించే దుస్థితి కొచ్చాము. భౌతికవసరాల మీదే సంస్కారవంతుడు క్షేంద్రీకృతుడు కావడం అన్యాయమే. కాని కాలేకడుపులతో

తత్వచింతనచెయ్యలేము. సహజంగానే మనల్ని ప్రస్తుతము భౌతికవాదము ఆకర్షించి, పునర్జీవితుల్ని చేసి ఏకోన్ముఖంచేసి ముందడుగు వేయిస్తూ మనజీవితాలకు అర్థాన్ని కూరుస్తోంది. ఇందులో ఎవ్వరమూ కించబడివలసినదీ, కినుక వహించవలసిందీ లేదు.

ఈ రెండు సంస్కృతుల సమ్మేళనానికి భారతదేశం మిక్కిలిఉత్తమమైన రంగస్థలం. అన్ని దేశాల్లోనూ స్థితప్రజ్ఞులూ, మేధావులూ వున్నారు. కాని ఎందుకు ఈ దేశంలోనే ఒక టాగూర్, ఒక అరవిందుడు, ఒక నెహ్రూ ఉద్భవించారో, ఈనాడు ప్రాచ్యదేశాలలో పాశ్చాత్యదేశాల్లో సుహృద్భావం కలిగించి, ప్రాచ్యవాణిని ప్రపంచానికి వినిపిస్తున్న ఒక వ్యక్తి ఎందుకు జాతీయుడో మనం గమనించాలి. దీనికి కారణం సహజంగా తత్వచింతన ఎరిగివున్నమనం భౌతిక వాదాన్ని కూడ ఎక్కువగా జీర్ణము చేసుకున్నందు వలననే.

అందుచేత మనం ఎప్పుడూ పాశ్చాత్యదృక్పథానికి సన్నిహితంగా వుండగలిగేందుకు మనకు ఇంగ్లీషు భాషాసహచర్యం అవసరం. ఆ భాషను రాజభాషగా మనం నిలుపుకుంటే, దానిని రెండవభాషగా ఈ జాతి అభ్యసించి పైచారిత్రిక బాధ్యతను నిర్వర్తించుకుంటుంది. అప్పుడే మన జీవితాలకు వెలితివున్నవైపు పూరించ బడటముజరుగుతుంది. అప్పుడే మన జీవితాలకోనిండుదనము మన కార్యాచరణకో అర్థం ఏర్పడుతవి.

అలాకాదని హిందీని తెచ్చుకుంటే అదిజాతిజీవనాన్ని మరింత ఆరోగ్యవంతం, ఉద్వేగపూరితం చేయలేదు. దానిలో వున్న శక్తిసంస్కృత భాషపెట్టిన భిక్ష. ఆ వరప్రసాదము, మన తెలుగువారికీ ఇంకాఅన్ని ప్రాంతీయ భాషలవారికీవుంది. అందుచేత హిందీ మనకు వేరే ఒక ఆశయాన్నందించలేదు; మన ఆత్మశక్తిని రగల్చలేదు; మన ఉద్వేగాన్ని పోషించలేదు. ఫలితంగా మన పురోభివృద్ధి ఆగిపోయితీరుతుంది. నీరు నిల్వ వుంటే మురిగినట్లు, ఇంత బ్రహ్మాండమైన జాతికిపురోగమనము లేకపోతే, ఎప్పటికప్పుడు ఉత్పన్నమయ్యే శక్తంతా తిరోగమనం సాగింపిస్తుంది.

## ఈ) సాహిత్యము

ఇకసాహిత్యపరంగా చూసుకుంటే, ఇంగ్లీషు యొక్క ప్రభావము దేశీయ సాహిత్యాల మీద అపరిమితమని చెప్పాలి. 19 వ శతాబ్దము మొదటి పాదములోని కాల్పనికోద్యమము(Romanticism) వద్దనుంచీ నేటివరకూవున్న యథార్థవాదము, అధివాస్తవికవాదము, డాడాయిజామున్నగు అన్ని ఆంగ్లేయ సారస్వతోద్యమాలు మన భాషా సాహిత్యాల్లో వర్డ్సువర్త్, కీట్స్, షెల్లీ,స్విన్ బర్న్, ఇలియట్‌లు తలెత్తడానికి దోహదము చేసినవి.

ఇదివరకే సిద్ధములైవున్న సాహిత్య రూపాలుకాక, నవల, జీవితచరిత్ర, స్వీయచరిత్ర, ప్రహసనము, విమర్శ, కథానిక మొదలగునవ్యరీతులు ఆంగ్లేయ సంపర్కమువల్ల మన సాహితీనికుంజానికి పూచినకొన్ని పుష్పాలు. ఉదాహరణమే

తెలుగుభాషను తీసుకుంటే, ఒక్క కథానికతప్ప మిగతా పైనుదహరించిన రూపాల్ని ఆంధ్రదేశము లోనికి తెచ్చి, సాంఘిక, సారస్వత రంగాల్లో ఆధునిక యుగ పురుషుడయ్యాడు మన కందుకూరి వీరేశలింగం. ఇక, కథానికలో విశేష ప్రచారాన్ని స్వయంగా తేకపోయినా, మేలిబంతులులాంటి చక్కని కళా ఖండాల్నిచ్చి, నేటికి దానికి ఇంతరంగాన్ని ప్రతిష్టాపన చేసిన గౌరవం శ్రీగురజాడ వారిది.

ఇక అనువాద సాహిత్యము కొల్లలు. ప్రపంచంలో అన్ని భాషలలోకీ, అధికతమ సంఖ్యాకులు అర్థం చేసుకోగల భాష ఇంగ్లీషు. ఈ ప్రచార బాహుళ్యానికి తోడు, శక్తి సమన్వితమైన భాషకూడ కావటంవల్ల, ప్రపంచంలో ఉత్తమ సాహిత్యము ఏమూల సృష్టిజరిగినా, అది 24గంటల్లో ఆభాషలోకి వస్తుందనే ప్రతీతి ఆ భాషకుంది. ఇలా ప్రపంచంలోని ఉత్తమ సాహిత్యమంతా, సామాన్యుడికి అందుబాటులో వుండే నిమిత్తం ప్రాంతీయ భాషలలోకి వచ్చెయ్యాలి. అప్పుడీ భాషలు సుసంపన్నమూ జాతిపురోభి వృద్ధి హేతువూ అవుతవి. ఇది భగీరథ ప్రయత్నం వంటిది. ఇది జరగటంలో మనకు ఆంగ్లేయభాష ఎంత దోహదకారి అవుతుందో, హిందీ ఎంత నిరుపయోగమో వేరేచెప్పనక్కరలేదు.

మనదేశంలో బ్రిటీషు యుగంలో ఇంగ్లీషు దేశభాషల్ని అణగత్రొక్కింది అన్న అపోహ ఒకటి ప్రచారమవుతూ వున్నది. మనప్రాంతీయ భాషల్ని నిర్వీర్యం, నిస్తేజము చెయ్యాలని చూసింది ఇంగ్లీషుకాదు, ఇంగ్లీషువాడు. అతను

తన స్వప్రయోజనాల నిమిత్తం, ప్రభుత్వ వ్యవహారాన్నుంచి, విద్యావిధానం నుంచి ప్రాంతీయ భాషల్ని దూరంచేసి, ఇంగ్లీషును నిలబెట్టాడు. ఫలితంగా దేశభాషలకు దోహదం, ఆదరం లేకపోయినవి. అయినా ఇంత దిక్కుమాలిన స్థితిలో కూడ, అవి అనధికారంగా ఇంగ్లీషు సాహిత్య సంపర్కం కారణంగా జీవం చావకుండా నవనవోన్మేషంగా విస్తరిల్లుతున్నవి. ఆ సంపర్కము అంత జీవనదాయి అయినట్టిది, అంత ఉద్దీప్తికరమైనట్టిది. ఈ జీవభాషలు దానిచల్లటి నీడలక్రింద ఇప్పుడు సేద తీర్చుకోగలవు.

ఈనాడు మనప్రాంతీయ భాషలకు మనం క్రొత్త బాధ్యతల్నిస్తున్నాము. ఇవి చాలాబరువైన బాధ్యతలు. ఈయుగ సంధ్యలో ఆ మహాసాహిత్యాన్ని — మనస్వంతమయినదాన్ని — చేజేతులా వదులుకోవడం ఎంతతొందరపాటో విజ్ఞులు ఆలోచించాలి.

ఉ) అంతర్జాతీయదృక్పథము.

సహజంగానే ఆధునికయుగంలో అంతర్జాతీయ దృష్టి విస్తరించింది. మానవ మేధస్సుఆస్తినీ, పల్లెనీ, ప్రాంతాన్నీ, రాష్ట్రాన్ని, దేశాన్ని అధిగమించి, సుందరస్వప్నాన్ని కన్నట్టు ప్రపంచమనే దృశ్యాన్ని వూహించింది. మానవహృదయము కుటుంబము, తెగ, ఉపజాతి, జాతి మొదలైన అడ్డుగోడల్ని దాటి, మధురభావాన్ని వెనురు వేసినట్టు, 'మానవజాతి' అనే భావసుమాన్ని గుబాళించినది. ప్రపంచం, మనుష్యజాతి, ఇదే నవ్యసూత్రము, యుగధర్మము.

ఇలా అంటే, ఈ యుగంలో జాతీయతా భావాన్ని పూర్తిగా విసర్జించాలనిభావంకాదు. ఆభావం మోతాదుకుమిం చితే నాజీజన్మనీగా తయారుకావడం ఎంత తథ్యమో, ఆభావం ఏ మాత్రం తక్కువయినా అంతర్జాతీయ రంగంలో ఆ ప్రజలు గౌరవంగాను, పలుకుబడితోను జీవించలేకపోవడం కూడ అంతే తథ్యం. మనము భారతీయులు గానేవుండి, ప్రపంచ రంగంలో మనపాత్రను స్వేచ్ఛతోను సమర్థతతోను నిర్వ హించాలి.

జాతులమధ్య పరస్పరస్నేహం, స్వతంత్రప్రతిపత్తి ప్రాతిపదికలుగా అంతర్జాతీయ సంబంధాలు సుదృఢం అవు తున్న ప్రస్తుత ఘట్టంలో ఇంగ్లీషు సర్వత్ర అంతర్జాతీయభాష గా గౌరవించబడుతున్నది. ఈ విషయంలో ప్రజాస్వామ్య రాజ్యాలు కమ్యూనిస్ట్ రాజ్యాలు అన్న భేదంకూడా లేదు. రాధాకృష్ణన్ కమిషన్ రిపోర్టులోని ఈ క్రిందివాక్యాలు గమ నించతగినవి:

"బ్రిటిషు దీవులు, అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండు, దక్షిణాఫ్రికా— ఈ దేశాలప్రజలకు ఇంగ్లీషు మాతృభాష. రష్యాతోసహా దాదాపు అన్నియూరోపు దేశాలలోను అవి రెండవభాషగా బోధించ బడుతున్నవి; ఆసి యాలో దానికి బహుళప్రచారం వుంది. ఈనాడు ప్రపంచ రాజకీయ వ్యవహారాలకు అది ప్రథమభాష; అధిక తమ సంఖ్యాకులు దానిని అర్థం చేసుకుంటున్నారు.

"... ఏమహావిపత్కర పరిస్థితులో ఏగ్పడి ప్రస్తుత ప్రపంచశక్తుల స్థితి తల్లకిందులు కాక పోయినట్లయితే, అది త్వరలో ప్రపంచ భాష కాగలదు."

మనం ఎంతదూరమో పోనక్కరలేదు. ఈనాడు ఇండియా అంతర్జాతీయ రంగంలో ఇంతటి వ్యక్తిత్వాన్ని ప్రదర్శించి గౌరవ మన్ననలు చూరగొంటున్నదంటే, మనకు ఇంగ్లీషు సహాయము లేకపోతే ఇదిసాధ్యమయ్యేదేమో ఆలోచించాలి. ముందు ముందు ఈ ప్రపంచభాష అవుసరం మరింత పెరుగుతూ వుంటుంది. అందుచేత, ఇంగ్లీషుని వదలుకోవటం ద్వారా మనల్ని మనం బాహ్య ప్రపంచాన్నుంచి మూసివేసుకోవటం ఎంత వివేకం?

కాబట్టి ఇంగ్లీషుభాషని నిలుపుకోవటం ఈ జాతికి గొప్ప అవసరం. ఈ అవసరం మిగతా ప్రాంతీయ భాషల వాళ్ళకెంత అవసరమో హిందీవారికీ అంత అవసరం అన్నది సువిదితము. అందుచేత హిందీభాష అభివృద్ధిదృష్ట్యా, మొత్తం ఇండియాయొక్క క్షేమందృష్ట్యా, ఇంగ్లీషు నిలుపుకోవటానికి హిందీ ప్రాంతీయులు విశాలదృష్టిని కనపరిస్తే, ఇండియా భవిష్యత్తు విషయమై మనం గొప్ప క్షేమంకరమైన నిర్ణయంచేశామన్నమాట.

అసలురాజభాషను ఇంగ్లీషు, హిందీలమధ్యన, ఎన్నిక చెయ్యటం కూడకాదు, ఇప్పుడు మనపని. ఎందుచేతంటే ఇంగ్లీషు దాదాపు శతాబ్దం నుంచీ మనకేంద్రప్రభుత్వభాషగా వుంటూనే వున్నది. దానికిరాదగిన ఇతర స్థానాలనుకూడ

ఆక్రమించటం వల్ల, దానికి దేశంలో పెద్దప్రచారం వచ్చింది. అందులో మనకు ఎంతోమంది వక్తలు, మేధావులు, రచయితలు ప్రపంచ సారస్వతాన్ని సృష్టించిన మహాకవులూ వున్నారు. ఎన్నో ఇంగ్లీషు పదాలు, సంప్రదాయాలు, మన భాషలోను, జీవితంలోను, సంప్రదాయాల్లోనూ విడదీయరానంతగా కలిసిపోయివున్నవి. అది కేవలం బ్రిటిషు వాళ్ళభాషే నను కోవడం, హిందూ దేశపుభాష కాదనుకోవడం చాల అర్థ రహితం. ఆ భాషను మాతృభాషగా గలవాళ్ళుకూడ ఈ దేశ పౌరులు గణనీయమైన సంఖ్యలో వున్నారు.

కేంద్ర ప్రభుత్వానికి సంబంధించిన అన్నివ్యవహారాలకు, శాసనాలకు సంబంధించిన పదజాలం మన విద్యావంతులకు సుపరిచయం. ఎన్నో దశాబ్దాలనుంచి ఆ భాషను విరివిగా అభ్యసించి మనం, కేంద్ర సర్వీసులకి కూడ ఎంతో నిగిలిపోయేంత సిబ్బందిని అన్ని కేడర్లలోనూ, శాఖల్లోను కలిగివున్నది. ఇదివరకు నుంచీ మన రాజభాషా అవసరమును తీరుస్తూవున్న ఈ భాషను— రెండువందలయేండ్లుగా ఎన్నో శ్రమలకోర్చి దీక్షగా అభ్యసించిన భాషను పరిత్యజించి, మళ్ళీ ఎన్నో వేల కొత్తపదాల్ని ఒకకొత్త భాషలో సృష్టించుకుని దానిని మళ్ళీ రెండువందల యేండ్లు మనమంతా అభ్యసించడంలో గల ప్రయోజనం ఎటువంటిది? ఈ అభ్యసించడంలో మళ్ళీ ఎంతోశక్తిని ఎందుకు వృథాచెయ్యాలి?

మనం ఇదివరకే అనుకున్నట్టి రాజభాష ప్రజలభాష కాదనే స్థితివల్ల ఎక్కువ నష్టపడేదివుండదు. అన్ని రాష్ట్ర

ప్రభుత్వ భాషలు ప్రజలభాషలే అయివుంటవి. మరిలాంటి స్థితిలో ఏ భాష అయితేనేం, ఇంగ్లీషేవుండాలి అని పట్టుదల ఏమిటి అని ప్రశ్నవస్తుంది. దీనికి సమాధానం:

(1) అసలు, ఉన్న ఇంగ్లీషును తొలగించి దానిస్థానే ఇంకోభాషని తేవటానికి కారణం లేదుగనుక.

(2) ఇంగ్లీషును ఉంచుకోవడం వల్ల పైచెప్పిన అనేక మహత్తర ప్రయోజనాలు కలుగు తున్నవి కనుక.

అందులో రాజభాషను ఈ దేశంలో రెండవభాషగా బోధిస్తాము. అందుచేత ఈ దేశప్రజలకు ఇంగ్లీషుతో, తద్వార పాశ్చాత్యదృక్పథముతో సన్నిహిత సంబంధము ఉంటుంది.

రెండో విషయము. హిందీ మాత్రం ఈదేశ ప్రజ లందరి భాషఎట్లాఅవుతుంది? 20 కోట్లమంది ప్రజలు వేరే భాషల్ని కలిగి వున్నారు. హిందీని రాజభాషగా ఉంచితే, ఆ 15 కోట్లమంది ప్రజలకు కొంత ఎక్కువ సౌకర్యం కలుగు తుంది. కాని మిగతా భాషలవాళ్ళకు, దేశానికి దానివల్ల కలిగే నష్టం ఆ పైసౌకర్యం కంటె ఎంతో ఎక్కువఅని సహృదయులు ఒప్పుకోకపోరు. కాబట్టి దేశాన్ని మొత్తంగా దృష్టిలో పెట్టుకుని హిందీవాదులు ఈ సహృదయతను ప్రదర్శిస్తారని ఆశిద్దాము.

హిందీని గురించి ఇలా ఏదో మాటలు వ్రాస్తూంటే, ఈ రచయితకు ఆభాషంటే కొంత తేలిక భావముగాని ద్వేషముగాని వున్నయ్యని ఎవరేని అభిప్రాయ పడటానికి అవకాశ

ము కలిగితే, వాళ్ళ క్షమాపణను అడుగుతున్నాడు ఈ రచయిత. ఒకజీవద్భాషను ద్వేషించటమంటే ప్రాణ స్పందనను ద్వేషించటమన్నమాట. సృష్టినే ద్వేషించటమన్నమాట.

అతిప్రాముఖ్యము కలిగిన ఈవిషయాన్ని గురించి వ్రాసేటప్పుడు ఏదైనా అసంతోషకరమైన సత్యాల్ని చెప్పటానికి వెనుదీయడం వల్ల ప్రయోజనం లేదు. ఇండియాలో ఏ ఇతర భాషకంటె, హిందీని ఎక్కువమంది మాట్లాడుతున్నారన్న విషయం దానికి ఏవిధమైన ప్రత్యేకార్హతల్ని, గౌరవాన్ని, ప్రతిపత్తిని కలిగించదు. ఈ విషయం ఇదివరకే సిద్ధాంత రూపేణ కొంత చర్చించబడింది. ఇప్పుడు ప్రత్యక్షంగా విదేశాలలో భాషల స్థితులెట్లా వున్నదీ పరిశీలిస్తే, ఇంకా ఏమైనా సందేహాలుంటే నివృత్తి కాగలవు.

**5. విదేశాలలో భాషల స్థితులు**

సుమారు అరకోటి ప్రజలున్న స్విట్జర్లండులో 3 ప్రముఖ భాషల వాళ్ళున్నారు. అందులో "జర్మన్ భాష మాట్లాడే వారి సంఖ్య, ఫ్రెంచి, ఇటలీ భాషలు మాట్లాడే వారి మొత్తం సంఖ్య కంటె చాల ఎక్కువ అయినప్పటికీ, ఏభాషా అధికమైన స్థానము ఇవ్వబడలేదు; రాజ్యవ్యవహారాలకు మూడూ వాడబడు తున్నయ్. ఏ ప్రాంతములో విద్య ఆ ప్రాంతీయ భాషద్వారా బోధించబడుతోంది." అంతేకాదు 75000 మందిప్రజలుమాట్లాడేమరొక భాష 'రుమాన్ ష్' వుంది ఆ దేశంలో. ఈ మధ్య ఆభాషను కూడగుర్తించి మిగతా భాషలతో సమానమైన ప్రతిపత్తిని కలుగచేశారు.

ఈవిధముగానే, కెనడాలో ఫ్రెంచి ఇంగ్లీషులు, దక్షిణాఫ్రికాలో 'ఆఫ్రికాన్సు' ఇంగ్లీషులు, బెల్జియములో ఫ్రెంచి, డచ్ భాషలలో సన్నిహిత సంబంధాలు కలిగిన 'వాలూన్' 'ఫ్లెమిష్' భాషలు ఆయా ప్రభుత్వాలచేత గుర్తించబడి అన్ని జాతీయావసరాలకు సమానంగా వాడబడుతున్నయ్.

ఇక ప్రముఖదేశాలు అమెరికా, రష్యాలు బహుభాషా ప్రాంతాలు. ఈ దేశాలలో వరుసగా ఇంగ్లీషు, రష్యన్ భాషలు మాట్లాడే వారిసంఖ్య మిగతా భాషలవాళ్ళ సంఖ్యకంటె హెచ్చుగా ఉండడంచేత ఆ భాషలు ఆ దేశాలకు జాతీయ భాషలుగానో, రాజభాషలుగానో ఉంటున్నయ్యని చాల మంది అనుకుంటుంటారు. కాని ఈ విషయంలో అసలు నిజాలు ఇవి.

**(అ) అమెరికాలో స్థితి.** అమెరికాలో అన్నిదేశాల ప్రజలూ, ముఖ్యంగా అన్ని యూరపు దేశాల ప్రజలు వుంటున్నారు. అక్కడి ప్రజల మాతృభాషలనన్నిటినీ లెక్కలోకి తీసుకుంటే సంఖ్యచాల పెద్దదిగావుంటుంది. మరిఅక్కడ భాషాసమస్య ఎలా పరిష్కారమైంది? మొట్టమొదట అమెరికా కేవలం బ్రిటీషు వారివలన. అదివరకు అక్కడున్న కొద్దిమంది డచ్చి, ఫ్రెంచి, స్పానిష్ ప్రజలు తరువాత విపరీత సంఖ్యల్లో వచ్చిన ఇంగ్లీషు జనాభా మరుగునపడిపోయారు. ఇటీవల అన్ని దేశాలనుంచి ప్రజలు తరలివెళ్ళింది, అమెరికా ఇంగ్లీషుమాట్లాడే రాజ్యంగం పూర్తిగా స్థాపనఅయ్యాకే. ఇలా వెళ్ళినవాళ్ళు అక్కడ పూర్తిగా చలామణీలో వున్న భాష

కే అలవాటు కాజొచ్చారు. ఇంగ్లీషుకున్న సహజశక్తి సంపదలుకూడ అనిఅందరి మన్నన, అమాంతం పొందడానికి తోడ్పడినవి. ఇప్పటికీ అక్కడక్కడా వేరేభాషలు మాట్లాడే చిన్న చిన్న 'ద్వీపాలు' వున్నప్పటికీ, అవి ఏమాత్రం రాజకీయ ప్రాముఖ్యంకోసం ప్రాకులాడే స్థితిలోగాని అవసరంలోగాని లేవు. అందుచేత వాళ్ళకసలు భాషాసమస్యే లేదనీ, అన్ని భాషలు వాళ్ళున్న అమెరికా ఏకభాషా ప్రాంతమేనని చెప్పవచ్చు. అమెరికా రాజ్యాంగంలో ఈ ప్రసక్తేలేదు.

(ఆ) రష్యాలో భాషలు.

అసలు, స్థూలదృష్టికి, మనకూ, రష్యాకూ కొద్దోగొప్పో పోలికలు కన్పించుతవి. అమెరికాలో లాగ ఇతర భాషల వాళ్ళు పలచ పలచగా తరువాత వెళ్ళటము కాకుండా రష్యాలో 'రష్యన్' కాక ఇతరభాషలవాళ్ళు మొదట్నుంచీ వుంటున్నారు. ఇప్పుడు వాళ్ళకు వేర్వేరు 'రాష్ట్రాలు' కూడ వున్నవి. బైలోరష్యన్లు, ఉజ్బెక్కులు, ఖజక్కులు, టజిక్‌లు, టర్క్‌మేనియన్లు, టార్టార్లు, యుక్రేనియన్లు, జార్జియన్లు, అజర్‌బైజాన్లు మొ॥ వారు రష్యనేతర ప్రముఖ జాతులు. ఇందులో ఒకటిరెండు జాతుల్ని మినహాయిస్తే, మిగతా వారందరికీ స్వభాషా 'రాష్ట్రాలు' (రిపబ్లిక్కులందరు) వున్నాయి. ఆయారాష్ట్రాలలో ప్రభుత్వవ్యవహారాలు, విద్యాబోధన — అంతా ఆయారాష్ట్ర భాషలలోనే జరుగుతవి. దేశంలో మాట్లాడే అన్నిభాషల్ని జాతీయ భాషలుగాను, దేశానికంతకూ రాజభాషగా రష్యనును స్వీకరించారు.

అందుచేత రష్యాలో రష్యను స్థితికి మనదేశంలో హిందీ స్థితికి ఎంతో సామ్యమున్నట్లు కనిపిస్తున్నది. కాని కొంచెం లోతుగా పరిశీలిస్తే, ఈ పోలికఏమాత్రం నిలవదు. రష్యను మాట్లాడే ప్రజలు శతాబ్దాలుగా రష్యాను పాలిస్తున్న ప్రముఖజాతి— ఉన్నతవిద్యకు, విజ్ఞానానికి, సారస్వతానికి, సంస్కృతికి ఆధారమైన శక్తిమంతమైన భాష రష్యను. ఇప్పటి రష్యను భాషస్థితిని, వేదకాలంలో మన దేశంలో సంస్కృత భాషకున్నస్థితితో పోల్చవచ్చును. ఆధునిక ప్రపంచంలో ఒక విశిష్టమైన శక్తిగా రూపొందిన కమ్యూనిజం, దశాబ్దాల సిద్ధాంత చర్చల అనంతరము విస్తారమైన గొప్పసాహిత్య నిర్మాణం సహాయంతో ఒక కచ్చితమైన రూపందాల్చినది రష్యను భాషలోనే. సిద్ధాంత స్రష్టలైన మార్క్సు, ఏంజల్సు జర్మను భాషలో వ్రాసినా, ప్రముఖసిద్ధాంత ప్రవక్తలైన లెనిన్, బుఖారిన్, స్టాలిన్ తదితరులు తమ భావాలను ప్రచారించినది రష్యనులోనే. ఒక జీవిత విధానమైన కమ్యూనిజమును తనలో జీర్ణించుకున్న రష్యనుభాష రష్యాలోని అన్నిజాతుల రాజకీయ సాంస్కృతిక జీవనంలో ప్రముఖస్థానాన్ని ఆక్రమించుకోవటంలో ఆశ్చర్యం లేదు.

ఇంతేకాదు. రష్యను భాషయొక్క శక్తి సంపదలు, వైభవంతోపాటు మిగతా భాషల బీదతనము కూడ రష్యనుభాషకు ఇప్పటి స్థానాన్ని సంపాదించి పెట్టినది. మిగతా భాషలలో దేనికీ రష్యను భాషతో పోల్చదగిన చరిత్రా, సంస్కృతిలేదు. అసలు పోలికే విడ్డూరమూ అని

పిస్తుంది. 40 భాషలకు పైనా అక్టోబరు విప్లవం తర్వాత లిపులు ఇవ్వబడినవంటే ఆభాషా ప్రజల సాంస్కృతిక స్థితిని అర్థం చేసుకోవచ్చును. ఇలాంటి స్థితిలో మిగతా భాషలన్నీ రష్యను భాషనుంచి ఉత్తేజాన్ని, ఉద్వేగాన్ని పొందినవన్నా, రష్యనును వాళ్ళు రాజభాషగా స్వీకరించారన్నా ఆశ్చర్యం లేదు.

ఉదాహరణకు, సంస్కృత భాష

ఇ) సంస్కృతము 'మృతభాష' గాకాక (దానినిమాతృ భాషగా గలవారెవరూ లేరు అన్న అర్థంలో) ఆధునికావసరాలను తీరుస్తూ, ఆధునిక మార్గాలలో అభివృద్ధి చెందుతున్న దనుకొందాము. దానిని భారతదేశ జనాభాలో కొంత భాగం ప్రజలు మాట్లాడుతున్నారనుకొందాం. ఆ కొంత భాగం హిందీ జనాభా అంత ఉండనక్ఖరలేదు. ఉదాహరణకు రెండు కోట్ల ప్రజలున్నాచాలు. ఆ భాషను మనం రాజభాష చేసుకుని ఉండేవాళ్ళం. దేశంలో ఏ వర్గమూ అభ్యంతర పెట్టివుండేవారుకారు. ఎందుకంటే, మిగతా భాషలకి ఆభాషా సంపర్కము సహజంగా అంత ఉద్దీపనకరమైనది. సరిగా అంత సహజంగానూ రష్యాప్రజలు రష్యను భాషను రాజభాషగా చేసుకున్నారు.

మనం ఇప్పుడు అంత సహజంగానూ ఇంగ్లీషు భాషను రాజభాషగా వుంచుకొందా మంటున్నాడు ఈ రచయిత. ఎందుచేతంటే హిందీకిఆరష్యను,ఇంగ్లీషుభాషలకున్న స్థితిలేదు. ఒకక్క సంఖ్యాబలం తప్పితే, మిగతాదేశభాషల కంటె దాని

ఏ ఒక్క అర్హతా ఎక్కువ లేదు. రాజభాషకు కావలసిన అర్హత అదికాదనీ సంఖ్యా బలం ఆధారం చేసుకుని ఏ ఒక్క భాషకీ ఎక్కువ ప్రతిపత్తీ, 'ప్రివిలేజ్' కలిగించరాదనీ, విదేశాలలో భాషల స్థితులనుబట్టి మనం గ్రహించాము. ఇక ఏ కాలంలోనూ ఆ భాష భారతదేశాన్ని ఉత్తేజ పరచలేదు. సాంస్కృతిక, రాజకీయ తాత్విక రంగాలలో ఏ రంగంలోనూ అది ఎన్నడూ మనకు మార్గదర్శకం కాలేదు. ఇవి అరుచికరములైన సత్యాలు.

ఒక ఊరిలో ఒకటి మిగతా అన్నిటికంటే పెద్ద కుటుంబం. అన్ని కుటుంబాల్లోకంటె ఈ కుటుంబంలో జనాభా ఎక్కువ అనే ఒకే ఒక కారణంమీద ఈ కుటుంబం తాలూకు యజమాని వేరే యోగ్యతలు ఏమీ లేకుండా గ్రామ పెత్తందారు కావాలనడం హాస్యాస్పదం; ఊరికి ఆ కుటుంబంతో సహా గొప్పనష్టం.

**6) పరిస్థితి: కర్తవ్యము**

పరిస్థితులు, యదార్థాలు ఇలావుండగా అజ్ఞానంకొంత, దురావేశం కొంత కారణంగా దేశంలో కొన్ని వర్గాలు హిందీ విషయమై ప్రచారం చేస్తున్నవి. ఇదివరకే మనం గమనించినట్లు, ఏ సమస్యను ఆ దృష్టితోనే అవసరమైనంత వరకే చూడక ఈవర్గాలు మోకాలుకీ బట్టతలకీ ముడిపెట్టి ఏవేవో భయాలు, విద్వేషాలు ప్రచారంచేసి సమస్యల్ని గంద్రగోళము చేస్తూంటవి. బొంబాయి ప్రభుత్వము, శ్రీ కె. యం. మున్షీ బోధనావాహకంవిషయంలోఎంతఅవివేకపూరి

తమైన, ఆలోచనా రహితమైన విధానాన్ని కొనసాగించే ప్రయత్నం చేశారో చూశాము. ఇలాంటి వారే ఇంకొక వర్గము వారున్నారు. వీరికీజాతీయతఆవేసించినట్లేవారికిసంస్కృతజాడ్యము అతితీవ్రంగా పట్టివుంది. వాళ్ళ ఉద్దేశ్యం ప్రకారం, ఇప్పుడు పతనమయిపోతూ అవసాన దశలో ఉంది. 'భారతీయసంస్కృతి' ఇదంతా మ్లేచ్ఛులమ్లేచ్ఛ భాషయొక్క దుష్ట ప్రాబల్యమువల్ల నేజరిగింది. దానిని మనం రక్షించుకోవాలంటే, మనకు దక్కించుకోవాలంటే ఇంగ్లీషును వెంటనే- వీలైతే ఈ క్షణంలో- దేశంనుంచి సమూలంగా పారద్రోలాలి. మళ్ళీ వీరే ప్రాచీన భారతీయ సంస్కృతి, సనాతన ధర్మం వీటి ప్రశస్త్యాన్ని గురించి ఉపన్యసిస్తుంటే వినాలి. వాళ్ళ ఉపన్యాసాన్ని అసలు వినటం కాదు, చూడాలి. మానవజాతి గత చరిత్రలో ఉద్భవించిన అన్నిసంస్కృతులకంటె, ఇప్పుడున్న వాటికంటె, ఇక అనంతమైన భవిష్యత్తులో రాబోయే వాటికంటె భారతీయ సంస్కృతి ఎంతో గొప్పది. అసలు పోల్చటానికే వీల్లేదు. ఇది 'సూర్యుడు తూర్పున ఉదయించును' అన్నంత సామాన్య సత్యము. అని ప్రపంచమంతా అర్జంటుగా ఒప్పుకోవాలి. మన వాళ్ళంతా నాగరికతలు నిర్మిస్తున్నప్పుడు, వాళ్ళంతాఎంతకిరాతకులో, అనాగరికులో, జంతువులో వీరువర్ణిస్తారు. వీరికితెలిసిన ఇందులో రెండు శ్లోకాల్ని, ఫ్రాయిడ్ సిద్ధాంతాలలోని మూడు వాక్యాలతో పోల్చి మన సంస్కృత వాసనల శ్రేష్ఠత్వాన్ని నిరూపిస్తారు. ఇంత దురహంకారుల్ని మూర్ఖుల్ని చూసి మన సంస్కృతి ఎంతఖిన్నపడు

తోందో తెలియదు. అసలు వీరిదెలాంటి భారతీయ సంస్కృతో ఊహించడం కూడ కష్టము.

మరి ఇంత భారతీయ సంస్కృతి శుద్రమైన ఇంగ్లీషు భాషవల్ల చెడిపోవటం ఏమిటో, పడిపోవటమేమిటో తెలియదు.

వీరు దేశంలో ఏమూలో, ఎక్కడో కూచుని వాళ్ళ బాధలేవో వాళ్ళుపడితే ఎవరికీ చిక్కుండదు. కాని నీచమైన వీరి సంస్కారము సామాన్యుల్ని భయవివశుల్ని చేస్తుంది. దుష్టమైన వీరి ప్రాంబల్యం కేంద్ర ప్రభుత్వాన్ని సైతం లొంగ తీస్తుంది. నిజంగా హిందీ విషయంలో కేంద్ర ప్రభుత్వము అనుసరిస్తున్న విధానాల్ని పరిశీలిస్తే, ఏదోకుట్రదారులజ్వరం లాంటి రహస్య తీవ్రతపొడగట్టు తుందంటే అతిశయోక్తి కాదు. దీన్ని కొంచెం వివరిస్తాను. ఇది ఖేర్ కమీషన్ నియామకానికి సంబంధించినట్టిది.

అ) ఖేర్ కమీషన్. రాజ్యాంగం 344 వ సూత్రంలో ఇలావుంది:

"ఈ రాజ్యాంగం ప్రారంభం నుంచి, 5 సం॥ లు గడచినపుడూ, అటుతర్వాత పది సం॥ లు గడచినప్పుడు రాష్ట్రపతి నియమించు సభాపతితోను, 8 వ అనుసూచిలో నిర్దిష్టములైన వివిధ భాషలకు ప్రాతినిధ్యము వహించు నటువంటి ఇతరసభ్యులతో కూడిన కమిషనును నియమించవచ్చును."

ఈ కమిషనువారు చేయవలసిన సిఫారసులు ఈ క్రింది విషయాల్ని గురించి అయివుంటుంది.

1) ఇండియా ప్రభుత్వవ్యవహారాలకు క్రమానుగతంగా హిందీ వాడకము.

2) అన్నిగాని కొన్నిగాని కేంద్రప్రభుత్వ వ్యవహారాలకు ఇంగ్లీషు వాడకాన్ని పరిమితం చెయ్యడం.

3) 348 వ సూత్రములో నిర్దిష్టములైన అన్నిగాని కొన్నిగాని పనులకు వాడవలసిన భాష. (సుప్రీం, హైకోర్టు లకు సంబంధించిన భాష.)

4) ఏదైన ఒకటిగాని అంతకంటె ఎక్కువగాని ప్రత్యేకించి చెప్పబడిన, ఇండియా ప్రభుత్వపు కార్యాలకు వాడవలసిన అంకెలు.

5) ఇండియా ప్రభుత్వ అధికారభాష, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు మధ్య, ఒక రాష్ట్రానికి వేరొక రాష్ట్రానికి మధ్య వ్యవహారవాహకమైన భాష— వాటి ఉపయోగాలకు సంబంధించి రాష్ట్రపతిచేత కమిషనువారి పరిశీలనకు సూచించబడినఇతర విషయములు.

ఈపై విషయాలకు సంబంధించి కమిషనువారు చేసిన సిఫారసులను, కొన్ని నిబంధనలకు లోబడి కేంద్ర ఉభయ సభలనుంచి ఎన్నుకోబడిన 30 మంది సభ్యులు తలఒక కమిటీ పరిశీలించి, తమ అభిప్రాయాలను రాష్ట్రపతికి నివేదిస్తారు. ఆ నివేదికను పరిశీలించిన మీదట రాష్ట్రపతి ఆజ్ఞలుజారీచేస్తారు.

దీనినిబట్టి, ఈ కమిషన్లకింత ప్రముఖమైన బాధ్యత వప్ప చెప్పబడిందో తెలుస్తున్నది. 8 వ అనుసూచిలో నిర్దిష్ట

మైనవి 14 భాషలు. ఈ 14 భాషలను మాట్లాడే ప్రజలఅభిప్రాయాలను గణనలోకి తీసుకునేందుకుగాను కమిషనులో ప్రాతినిధ్యము వుండాలని ఉద్దేశించబడిందనేది స్పష్టము. భాషల్నిమాత్రమేదృష్టిలో పెట్టుకుని, ఆయాభాషా ప్రజల అభిమతానుగుణంగా నిర్ణయాలు తీసుకోదలచినప్పుడు, అది సమానప్రాతినిధ్యమైతేనే సాధ్యమవుతుంది. సహృదయుడైన ఏ రాజ్యాంగ పాఠకుడికైనా అవగతమయ్యే విషయంఇది.

కాని మనంపైన అనుకున్న భాషా దురహంకారులు విజృంభించారు. శ్రీ టాండన్ అధ్యక్షతన సమావేశమైనారు హిందీ సాహిత్య సమ్మేళన్‌వాళ్ళు. ఆందోళన నడిపారు, తీర్మానాలుచేశారు. వాళ్ళ వాదనఏమిటంటే, హిందీ జనాభా ఎక్కువ కనుక, కమిషనులో దాదాపు సగంమంది హిందీ సభ్యులుండాలని. మొండివాడురాజుకంటే బలవంతుడు. 'మందతత్వము' ఆధారంగా ప్రకోపించిన వీళ్ళ మూర్ఖం ఎంతతీవ్రముగా తయారయిన దంటే, రాష్ట్రపతికికూడ వీళ్ళ ధోరణి పట్లవిసుగు జనించినట్లు పత్రికలు ప్రకటించాయి. చివరకిఏం జరిగిందో తెలిసి కొంటే కేంద్రంలో ఈ శక్తులబలం అంచనా వెయ్యవచ్చు. ఖేర్ అధ్యక్షతన నియమించ బడిన కమిషన్‌లో సమాన ప్రాతినిధ్యం లేదు. సుమారు మూడవవంతు హిందీ వాళ్ళు.

ఈ అవక తవకలు

**ఆ) కేంద్ర ఉద్యోగులు: హిందీ.** ఇంతటితో ఆగలేదు. మాతృభాషల్ని బట్టి ఉద్యోగులను 3 తరగతులుగా విభజించి, వారికి హిందీలో ఆఫీసు

గంటలలో ప్రత్యేక శిక్షణనిచ్చే ఏర్పాట్లను కేంద్రప్రభుత్వము ఆగష్టు 55 లోనేచేసింది. దేశంలోని ప్రముఖనగరాల్లో ఉద్యోగులకు శిక్షణ నిమిత్తం ప్రత్యేక పాఠశాలల్ని పెట్టే విషయముకూడ నిర్ణయాలు తీసుకోబడ్డట్టు హోంశాఖ వారి 1955 సం॥ పు రిపోర్టు సూచిస్తున్నది. ఇంతకూ అసలిలా ఉద్యోగుల్ని హిందీ, అభ్యసించే విషయమై నిర్బంధించే అధికారము కేంద్రప్రభుత్వానికి ఎలా వచ్చింది? రాజ్యాంగంలోని ఏ సూత్రమూ ప్రభుత్వానికి ఈ విషయాలలో అధికారము ఇవ్వ లేదు. ఈవిషయమై సూచనలుచేయమని కమిషనును అడగవచ్చు. ఈ సూచనలపై పైనచెప్పబడిన కమిటీ వారు నివేదికను సమర్పించినమీదట రాష్ట్రపతి అనుమతిపై కేంద్రప్రభుత్వము ఏర్పాట్లుచేయవచ్చును. మరి ఇదేదీ జరగకుండానే ఇలాంటి అధికార దుర్వినియోగానికి కేంద్రప్రభుత్వము తలపడవలసినంతటి అవసరమేమొచ్చిందో ఎవరూ చెప్పరు. ఈ రాజభాషా విషయంలో మొదట్నుంచీ ప్రభుత్వ వ్యతిరేక పక్షాలు కూడ ఎక్కువశ్రద్ధ తీసుకోకపోబట్టిగాని, లేకపోతే ఇది కేంద్రప్రభుత్వం చేసిన ఎంత ఘోరమైన నేరమో అందరికీ తెలిసి వచ్చేది.

**ఇ) హిందీ ప్రపంచంలో అంతర్యుద్ధాలు**

మరొక విషయం. అసలు రాజ్యాంగం రాజభాషగా ఉద్దేశించిన హిందీయొక్క స్వరూపం విషయమై హిందీవాదులలో ఎంతో అభిప్రాయ భేదమువుంది. ఇది మిక్కిలిగా సంస్కృత పదభూ

యిష్టముగా ఉండాలని ఒక వర్గమువారంటే, కాదు ఉర్దూపద సమ్మిశ్రిమముగాఉండాలని వేరొకమతము. ప్రజలలో వ్యవహారలలో వున్న శిష్టమైన హిందీని వాడాలని, 'హిందీ- హిందూస్తానీ' వంటివేరొక భాషను ఈ ప్రత్యేక ప్రయోజనాల కోసం సృష్టించాలని— ఇలా ఎన్నో వాదనలున్నవి. ఈ నాటికీ ఈ వాదనలు, తర్జన భర్జనలు ఎంతో, తీవ్రమైన స్థాయిలో హిందీ ప్రపంచంలో జరుగుతున్నవి. మరి ఈపద జాలము విషయమై ఒక ప్రవీణుల సంఘాన్నైన సంప్రతించ కుండానే, రాజభాష హిందీకి ఒక స్వరూపాన్నింకా నిర్ణయించ కుండానే, ఇప్పుడు ఉద్యోగులపై ఈ నియమం విధించారు. హిందూ పత్రిక ఈ సందర్భంలో (1-8-1955) ఇలావ్రాసింది.

హిందీ వాడుకల్లో ఈ శబ్దజాలము విషయమై అనేక మతాలున్నవి; ఎవరి సిద్ధాంతం వారికేవుంది. డాక్టరు రఘువీర, పండిట్ సుందర్‌లాల్, బాబూ పి. డి. టాండన్‌లకు వారి వారి శబ్ద జా లా లుం టే వి ద్యా శా ఖ వా రి కి వారి సిద్ధాతం వుంది. అధికార వ్యవహారాలకు ఏ శబ్దజాలము తగి ఉంటుందో ప్రవీణుల సంఘం అంతిమ నిర్ణయమైనా చెయ్యక ముందే ప్రభుత్వం నిర్బంధంగా హిందీని ఉద్యోగుల మీద నెట్టటం విషయంలో ఇంత తొందరపాటు చూపడం పరిశీలకులకు ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. ప్రభుత్వ వ్యవహారంలోని చురుకుదనాన్ని, సౌలభ్యాన్ని దెబ్బతియ్యకుండా, ఇంగ్లీషును తొలగించడానికి ఈ శబ్దజాలాల్లో ఏదైన తగినంత సులభంగాను, సమగ్రంగానువుండా అనే విషయంలో మళ్ళీ సందే

హము వుండనేవుంది. ఏదైనా ఒక స్కీమును ప్రవేశపెట్టే ముందు హిందీ కమిషన్ యొక్క సిఫారసులను ప్రభుత్వం వేచి చూడాలని పరిశీలకులు భావిస్తున్నారు."

అసలు ఈకమీషన్ వారి రిపోర్టు 1956 ఏప్రిలునాటికి రావలసివుంది. కొంత ఆలస్యమయిన కారణంగా జూన్ ఆఖరుకు రావచ్చునని ఆశిస్తున్నారు. నివేదిక కోసం 8, 9, మాసాలైనా వేచిచూసే సహనం లేకుండా, బాధ్యతనుత్రోసి రాజని, కేంద్రప్రభుత్వం ఇలాచెయ్యటం ఏరకంగాను సమర్థనీయంకాదు. ఇంకా ఈ మధ్య ప్రజాసభలో ఒక ప్రకటన జరిగింది. దాని సారాంశ మేమిటంటే, 1960 నుంచీ కేంద్ర ప్రభుత్వానికి సంబంధించిన అన్నిరికార్డులు ఇంగ్లీషు, హిందీ భాషలు రెండింటిలోనూ జరుగుతూంటవి. చివరకు 1965 లో ఇంగ్లీషును పూర్తిగా తొలగించటానికి ఈ 5సం॥ల అనుభవం ఉపయోగ పడుతుంది. ఈ రకమైన ఏర్పాటుకు కూడ కేంద్ర ప్రభుత్వానికి అధికారమెక్కడిదో అర్థంకాదు. అసలు హిందీ కమిషను వారు చెయ్యవలసిన సిఫారసులు కూడ ఈ విషయాల్ని గురించే. మరిప్రభుత్వం తనపనులేవో, తన ప్రయోజనాలేవో ముందుగానే నిర్ణయించుకుని, వాటిని నామమాత్రంగా ఆమోద ముద్ర వేయించుకోవటానికి ఈ కమీషన్ తతంగమంతా నడుపుతున్నది. అని అనుమానించక పోవడానికి ఏమీ ఆధారం కనబడటంలేదు.

ఆ మధ్య యూనియన్ పబ్లికు సర్వీస్ కమీషను పరీక్షలలోహిందీమాధ్యమము పెట్టేవిషయమై (అంటేపరీక్షలున్న

వలసిందిగా హోంశాఖ దేశంలోని అన్ని బాధ్యతాయుతసంస్థల్ని కోరింది. ఇది వెలువడిన వెంటనే దేశంలో దుమారం రేగింది. ఈ ఆలోచనలోని అవివేకము, దౌర్జన్యం, మూర్ఖం అన్ని వర్గాలవారికీ వెంటనే తెలిసివచ్చింది. శ్రీ రాజాజీ మొదలుగా ఎంతో మంది మేధావులు ఈవిధానాన్ని అతితీవ్రంగా ఖండించారు. దానితో హోంశాఖ ఆవిషయాన్ని ఉపసంహరించుకొన్నట్లు ప్రకటించింది.

ఇక హోంవిద్యాశాఖలు తమతమ రికార్డులలో ఎన్నో సందర్భాలలో హిందీని 'జాతీయభాష' గా పేర్కొంటున్నది. ఈప్రయోగం అసలు రాజ్యాంగంలోనే లేదని ఇదివరకే అనుకున్నాము.

రాజ్యాంగంలో ప్రభుత్వ విధానాన్ని నిర్వచించే 'డైరెక్టివ్ ప్రిన్సిపల్స్' లోఒక 'ప్రిన్సిపల్' ఏమిటంటే (45వది) "ఈ రాజ్యాంగం ప్రారంభమయిన 10సం॥ లోపల 14సం॥ లోపు పిల్లలందరికీ ఉచిత నిర్బంధవిద్యకు అవకాశాలు కల్పించటానికి. ప్రభుత్వం కృషిచేస్తుంది" అని. ఇదిమహత్తరమైన ఆశయం. దేశంయొక్క నాడినిప్రత్యక్షంగాస్పృశించే ఉన్నతమైనవిషయం. ఇదిఅమలు జరపటానికి నిజంగా ఒక్క ఆవగింజవంతు కృషి అయినా చెయ్యనిప్రభుత్వం, దక్షిణ దేశానికి హిందీ ప్రచారం నిమిత్తమై 2000 హిందీ ఉపాధ్యాయులను ఉత్తరాదినుంచి పంపించాలని ఆలోచన చేస్తుందంటే ఏవోమనకు అర్థంకాని శక్తులు భాషా విషయంలో ప్రభుత్వాన్ని లాంగదీసినవని చెప్పటంలో సందేహం వున్నదా?

**ఈ) కేంద్రప్రభుత్వపు పాక్షిక విధానము.**

ఎంత సౌమ్యంగా చెప్పాలన్నా, ప్రభుత్వపు ఈ తొందరపాటు వెనుక, ఈ తప్పులతడిక విధానాల వెనుక ఏదో అంతర్యము వుండాలి. అదిసూటిగా చెప్పాలంటే ఇది. ఇంగ్లీషును తీసివేసి, దానిస్థానే రాజభాషగా హిందీని తేవాలనుకున్న నిర్ణయంలోనూ, దానికి సంబంధించిన వాదనలోనూ ఎంతో బలహీనత వున్నది. ఎన్నో అనర్థాలకు దారితీసే బీజాలు ఆనిర్ణయంలో వున్నవి. తగినంత ఆలోచనలేకుండా ఆ నిర్ణయం జరిగింది. అయితే ఈ పొరపాటును దేశంలో అనేకవర్గాలవారు — మేధావులు, రచయితలు, శాస్త్రజ్ఞులు — గుర్తించి హిందీకి వ్యతిరేకముగా ఆందోళన చేస్తున్నారు. చివరకి ఈ ఆందోళన ఫలించి, తిరిగి వేరే నిర్ణయం తీసుకోవాల్సిన పరిస్థితులు రాకముందే, శరవేగంతో ప్రభుత్వ యంత్రాంగంలో హిందీని చొప్పించివేస్తే మళ్ళీ అదంతా ఇంగ్లీషులోనికి మార్చటానికి ఎవ్వరూ ప్రయత్నించరు. అందుచేత హోం, విద్యాశాఖలు ఎంతో వ్యయప్రయాసల కోర్చి, హిందీ సాంకేతిక పదాలు ప్రకటించి, నిఘంటువులు తయారు చేయించి, కమిషన్లను, నిపుణుల సంఘాల్ని నియమించి, హిందీ కూనని పరిణితుణ్ణిచేసి రాజభాషా గౌరవం తొడగాలని భగీరథ ప్రయత్నం చేస్తున్నవి.

ఈ ప్రయత్నాలకు వ్యతిరేకంగా దేశంలో అనేకమంది మేధావులు ఇదివరకే తమ తమ అభిప్రాయాల్ని ప్రకటించివున్నారు. దేశం నలుమూలల నించీ అనేకమంది

శాస్త్రజ్ఞులు— సర్ సి. వి. రామన్‌తో సహా— ఇంగ్లీషును తొలగించవద్దనే, రాజభాషా నిర్ణయాన్ని పునః పరిశీలన చేయవలసినదనీ ఏనాడో విజ్ఞప్తి చేశారు. ఆనాడు ఒక కెరటంలాగ దేశంలో ఆందోళనవచ్చి మళ్ళీ ఉధృతం తగ్గింది. శ్రీయుతులు లక్ష్మణస్వామి మొదలియార్, సి. పి. రామస్వామి అయ్యర్, శ్రీ పి. వి. రాజమన్నార్ అతిముఖ్యమైన ఈ భాషా విషయమై ఇంగ్లీషుకు అనుకూలంగా తమతమ అభిప్రాయాల్ని ఎన్నో సార్లు వ్యక్తంచేశారు. ఇక శ్రీ రాజాజీ హిందీ మాధ్యాన్ని ఖండిస్తూ చేసిన ప్రకటనలు, వ్రాసిన వ్యాసాలు దేశంలో విద్యావంతుల్లో ఎంతో చైతన్యాన్ని, కను విప్పును కలిగించినవి. రాజ్యాంగంలో నిర్ణయించిన 15 సం॥ గడువును వీలైనంత ఎక్కువ చెయ్యాలని— కనీసం 30 సం॥ అయినా ఉంచాలని ఆయన ప్రభుత్వానికి ఎన్నోసార్లు విజ్ఞప్తి, హెచ్చరికలుకూడ చేశారు. ఈ మధ్య మద్రాసు శాసన సభలో ఈ విషయమై ప్రస్తావన వచ్చినప్పుడు, రాజభాషగా ఇంగ్లీషునే వుంచాలని శ్రీ రాజాజీ అభిప్రాయ పడుతున్నట్లు ఒక సభ్యుడు మంత్రి దృష్టికి తేగా, దాన్నెవరూ ఖండించక పోవడాన్నిబట్టి, శ్రీ రాజాజీ అట్టి అభిప్రాయాన్ని కూడ వ్యక్తపరిచారని అనుకోవలసి వస్తున్నది. (హిందూ, 13-3-56). కాని వచ్చిన చిక్కేమిటంటే, ఈ భాషల విషయమై ప్రభుత్వం చాల మూర్ఖంగా ప్రవర్తిస్తున్నది. రైలు పట్టాలు పీకెయ్యటం, బస్సులు తగల పెట్టటం, స్టేషన్లను దోచుకొనేంతవరకు పరిస్థితి వస్తేనేగాని,ఏ ఉద్యమాన్ని, విషయాన్ని గమనించ నంతటి మందకొడితనాన్ని ప్రదర్శిస్తున్నది ప్రభుత్వం.

ఈ పరిస్థితిలో ఈ దేశం హితం కోరిన ప్రతి విద్యావంతుని కనీసకర్తవ్య మేమిటో నిర్ణయించుకోవటం అవసరం.

చరిత్రలో మార్పులు వస్తున్నవి

**ఉ) మారిన పరిస్థితులు.** ఇంగ్లీషు జాతిని మనసారా ఈ జాతి ద్వేషించిన సుమారు 100 సం॥ లోనూ ఏనాడూ ఎవరూ స్వాతంత్ర్యానంతరం బ్రిటన్, భారత దేశాలు ఇంత మైత్రీ భావంతో మెలుగుతాయని అనుకోలేదు

అప్పటి గాయాల్ని ఇంకా రేపి విద్వేష మాత్సర్యాలు ప్రకోపింపచెయ్యటం ఎంత అవివేకమో చాల ఉన్నతమైన బుద్ధిని, ఉదారమైన హృదయాన్ని ప్రదర్శించి ఈ జాతి గ్రహించింది. ఈనాడు ఈ రెండు దేశాలు చరిత్రలో హేయమైన ఒక అధ్యాయము తర్వాత, తిరిగి నిష్కల్మషమైన మనస్సులతోటి ఇంత స్నేహభావంతో ప్రవర్తిల్లటం నిజంగా ఈ మానవజాతి చరిత్రకే ఒక గర్వకారణం. అలాగే, ఇంగ్లీషుభాష ఆనాటిలాగ అన్ని జాతీయరంగాల్లో స్వైర విహారంచేసి మన దేశభాషల అభివృద్ధినే ఆటంకపరచేస్థితిపోయి, ఈ దేశానికి ఒక జాతీయ భాష కాక ఒక రాజభాష అన్న సిద్ధాంతాన్ని చేబడతామని గాని, ఈకొత్త పరిస్థితుల దృష్ట్యా ఇంగ్లీషు మన భాషాసాహిత్యాలకీ, మనశాస్త్రవిజ్ఞానానికి, మన అంతర్జాతీయ దృక్పథానికి ఈనూతన యుగంలోని మన మనుగడకీ, మన సంస్కృతిని విశాలం చేసుకోవడానికి సహాయపడి స్నేహితుడిగా మనం స్వీకరించగలిగే స్థితిలో వుంటుందనిగాని ఆనాడు ఎవరూ అనుకోలేదు, కాని ఈనాడు ఆ పరిస్థితులు ఏర్పడినవి.

మన అన్ని దేశ భాషలు ఆయా రాష్ట్ర ప్రభుత్వాల భాషలుగా వుండి దుర్నిరీక్ష్యంగా వెలుగ గలవు.

ఊ) హిందీప్రజలకు విజ్ఞప్తి.

హిందీ సువిశాలమయిన ప్రాంతంలో, అశేష ప్రజానీకం మాట్లాడే భాష. ఈ క్రొత్తపరిస్థితుల్లో ఆమహత్తరభాషకు కూడ ఏ అన్యాయమూ జరుగదు. కనీసం స్వయంసమృద్ధి కలిగిన నాలుగు క్రొత్త రాష్ట్రాలకు ఆభాష ప్రభుత్వ భాషగా వుంటుంది. ప్రభుత్వ వ్యవహారాల్లోనూ, విద్యావిధానంలోనూ, సాహిత్యంలోనూ, సంఘంలోనూ అది దానిసహజ స్థానాన్ని పొంది ఉన్నతమైన స్థితిని అతిత్వరలోనే పొందగలదు.

ఈనాడు కేంద్రంలో ఇంగ్లీషును ఒకపెద్దగా, హితుడిగా వుంచి మనకు కావలసిన ప్రయోజనాలను, సౌకర్యాలను సాధించటానికి హిందీ ప్రజలు ముందంజవెయ్యాలి. హిందీ విషయమై ఇదివరకటి నిర్ణయాన్ని మార్చుకోవటం, హిందీకి గాని హిందీ ప్రజలకు గాని, మొత్తం భారతదేశానికి గాని ఏ మాత్రం సిగ్గుపడవలసిన విషయంగాని, కించపడవలసింది గాని కాదు. వివేకాన్ని, ఉదారతను, ప్రస్తుత ప్రపంచంలోని భారత జాతి పాత్రను అర్థం చేసుకున్న శక్తిని మనం ప్రదర్శించాలి. దేశమంతా ఇంగ్లీషును రెండవ భాషగా మాత్రమే అభ్యసించి, ఆధునిక శాస్త్రమహా విజ్ఞానంతోనూ, సుదృఢమైన సంబంధాలతో ఒకక్రొత్తరూపంలోకి రావడానికి పెనుగులాడుతున్న అంతర్జాతీయ రంగంతోనూ, సజీవమైన, అవిచ్ఛిన్నమైన, స్వేచ్ఛాయుతమైన సంబంధాన్ని భారతప్రజలు ఇంగ్లీషుద్వారా

నేరపుతూ, ప్రపంచం ప్రస్తుతంవున్న విషమ ఘట్టంలో నుంచి బయట బయట పడటానికి తనవంతు కర్తవ్యాన్ని నిర్వహించటానికి సమాయత్తం కావాలి. ఈ చరిత్రాత్మక సమయంలో తప్పటడుగు— ఉద్దేశం ఉండిగాని, లేకగాని వేశామో— భవిష్యత్తులో కాంతిని చూడలేము; ప్రపంచం మనకు మూసుకుపోతుంది. ఇప్పటి మన అంతర్జాతీయ గౌరవాన్ని, పలుకుబడిని కోల్పోయి మన చారిత్రక బోధనత నుంచి జారిపోయిన వాళ్ళమవుతాము.

**ఎ) చివరిమాటలు.** మనకు ఉద్యమమే ప్రధానం కాదు. పై ఆశయం ప్రధానం. ఆ ఆశయంలోని ఉన్నతమైన బుద్ధిని, సౌకర్యాన్ని ప్రజలలో విరివిగా ప్రచారం చెయ్యాలి. ప్రభుత్వం కూడ తనవిధానాన్ని పునః పరిశీలించటానికి తగినంత ఒత్తిడిని ఆందోళనను తేవాలి. మనకు అభిప్రాయం వుండాలికాని, 1965 సం॥ తర్వాతకూడ ఇంగ్లీషు భాషను కొనసాగించే అధికారాల్ని పార్లమెంటుకు ఇస్తూ రాజ్యాంగంలో అవకాశం కల్పించబడే వుంది. (343 వ సూత్రంలో 3వ పేరా) అందుచేత విద్యావంతులందరూ— ఈ ఆశయాన్ని మనసారా, విశ్వసించిన పక్షంలో ఇక కాలహరణం చెయ్యకుండా కార్యక్రమానికి పూనుకోవాలి.

ఉదాహరణకి, ఆంధ్ర దేశంలో ఉద్యమం ఇలా ప్రారంభించవచ్చు. మనసౌకర్యం కోసం, మన తెలుగుభాష క్షేమాన్ని, అభివృద్ధిని కోరి మనం ఇంగ్లీషునే వుంచాలంటున్నాము. ఇది ఏరకంగానూ ఎవరి యెడలా విద్వేషంతో చెయ్యబడుతున్నట్టిది

కాదు అని ప్రజలకు తెలియచెప్పాలి. ఇలాంటి ఉద్యమాల్ని, జాతీయ విద్రోహమనటమో, లేక ఏ ద్రావిడ కజగంవారి వాసనలు అంటగట్టటమో పరిపాటుగా వుండవచ్చు. అందువల్ల మనమేమీ భయపడనక్ఖరలేదు. మన అంతఃకరణాలు నిష్కల్మషమైనవి. జాతీయభావపులకితులమై ఈపని చేస్తున్నామని ప్రజలకు నచ్చచెప్పవచ్చును. ఇకమనకెన్నో సాంస్కృతా సంఘాలు, రచయితల సంఘాలు, ఇతర అనధికారసంఘంలు, వున్నవి. రాజకీయాలప్రమేయం లేకుండా ఈ సంఘాలు తమ తమ అభిప్రాయాల్ని మెమొరాండాలద్వారా రాష్ట్ర ప్రభుత్వానికి, కేంద్ర ప్రభుత్వానికి వూపిరిసలపకుండా అందచెయ్యాలి. రాజ్యాంగం అమలులోకి వచ్చి 6 సం॥ అయిపోయింది. మన కార్యానికి గడువు ఇక 9 సం॥ మాత్రమే వుంది. మన జాతీయ నాయకులు— రాజెన్ బాబు, నెహ్రూ, పంత్ లు— ఎన్నోసార్లు మనవద్దకు వస్తూంటారు. వారు వచ్చినప్పుడు మన అభిప్రాయాన్ని వారికి నిస్సంకోచంగా తెలియచెయ్యాలి, విజ్ఞప్తుల ద్వారా. శాంతియుత ప్రదర్శనలు కూడ చేయవచ్చు.

ఈ చరిత్రాత్మక సమయంలో ఆంధ్రులు భారత దేశానికి మార్గదర్శకులవుతారని ఈ రచయిత గాఢంగా నమ్ముతున్నాడు. ఈ విషయంలో వచ్చిన ప్రతిసందర్భంలోనూ ప్రతి విద్యావంతుడు తన అభిప్రాయం తెలియచెయ్యడంలో ముందుకురావాలి. ఈ మాత్రం ప్రోత్సాహాన్ని కల్గించేటి ఆలోచనను ప్రతి విద్యావంతుడిలోనూ ఈ చిన్న వ్యాసం రేకెత్తించ గలిగితే ఈ రచయిత ధన్యుడు.

# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 9 | 1 | మాట్లాడుతున్న | మాట్లాడబడుతున్న |
| 12 | 8 | పేదకాలం | వేదకాలం |
| 12 | 10 | సంస్కృతిభాషలో | సంస్కృతభాషలో |
| 39 | 3 | సంస్కృత | సంస్కృతీ |
| 43 | 22 | బాదిస్తే | బంధిస్తే |
| 45 | 12 | జాతీయుడో | ఈ జాతీయుడో |
| 57 | 1 | పైనా | పైగా |
| 71 | 7 | బోధనత | బాధ్యత |

.గొప్పవాఙ్మయాలు కలిగివుండి, విశాల భూభా గాలమీద లక్షలకొద్దీ జనులచే మాట్లాడబడుతున్న ఇతర భారతీయ భాషలను దెబ్బతీసే పద్ధతిలో. దేశాన్ని త్వరితగతిని "హిందీ మయము" చెయ్యటానికి అవలంబించ బడుతున్న పద్ధతుల యెడల అనేక "అ హిం ం దీ" రాష్ట్రాలలో అసంతృప్తివుంది. హిందీని "రాష్ట్రభాష" లేక "జా తీ య భా ష" (National Language) అని వ్యవహరించటము సరికాదు.నిజానికి, భారత రాజ్యాంగం చేత గుర్తించ బడిన 14 భాషలూ మన జాతీయ భాషలే. కేవలం మాట్లాడుతున్న జనాభా బలాన్ని ఆధారంచేసుకుని హిందీ ఏ రకమైన అభిజాత్యాన్ని ఆశించరాదు."

త్రివేణి, జూలై '55.

---

గమనిక:- ఈ పుస్తకము చదివాక, ఏ వైన సందేహాలు కలిగినా, సమాచారము కావలసివచ్చినా ఈ క్రిందివారికి వ్రాయండి.

ఎం. లక్ష్మణరావు.
C/O ఆంధ్ర బుక్ హౌస్,
సుల్తాన్ బజార్ హైదరాబాదు. ద.